


అవును...అతను పౌరుషంలో పులి లాంటివాడే. పులి దెబ్బ ఎలా కాచుకోగలడో పడతుల పగదెబ్బనూ అంత నిదానంగా తట్టుకోగలడతను. పేరుకు లారీ డ్రైవరే అయినా పెద్ద పెద్ద ఆఫీసర్లకే అంత రంగికుడయిపోగలిగేడు. కొండల్లో, కోనల్లో ప్రమాదకరమైన ఘాట్ రోడ్లమీద సవ్యసాచిలా తన 'రథాన్ని' బ్రేకులు లేకపోయినా భయంకరమయిన మలుపులు తిప్పగలిగేడు... అంత వడుపుగానూ తన జీవిత రథచక్రాన్ని దారి తప్పకుండా తిప్పగలిగేడు...
ఎవరా సాహసుడైన సామాన్యుడు... ?

ఒకనాటి ఆంధ్ర-ఒరిస్సా సరిహద్దు ప్రాంతపు అడవుల అందాన్ని, కొండల నిండుదనాన్ని, అక్కడి ప్రజల అమాయకపు సౌందర్యాన్ని, ఆఫీసర్ల అహాన్ని అత్యంతాకర్షణీయంగా చిత్రించిన శ్రీ మంథా వెంకటరమణారావు నవల "పులి" చదివి చకితులు కావటం మీ వంతు!

ఈ అపూర్వమైన నవల ఆనాటి వాతావరణాన్ని సూచించే రంగుల రేఖా చిత్రాలతో ఆద్యంతం మిమ్మల్ని ఆకట్టుకుంటుంది. నవలతోపాటు అదనంగా మరో అద్భుత 'చతుర ప్రపంచం'లోని విశేషాలు మిమ్మల్ని చకితుల్ని చేస్తాయి. 'చతుర మినీకతలు ఉల్లాసపరచి గిలిగింతలు పెడుతాయి.
తెలుగులో మరే మాసపత్రికా ఇవ్వని రంగుల ఆఫ్‌సెట్ ముద్రణ, పంచ వర్ణ చిత్రాలు మిమ్మల్ని ఆకట్టుకుని తీరుతాయి.

నవ నవలా వేదిక

# చతుర

132 పేజీలు
వెల కేవలం రెండు రూపాయలే!
ప్రతినెలా 1వ తేదీకి వెలువడే చతుర
నవలా వేదిక.

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభు పసాద్
సంపాదకుడు
[1938 – 1972]

శుక్రవారం : 10-7-'81
దుర్మతి నామ సం. ఆషాఢ శు. నవమి
సంపుటము 74 : సంచిక 43

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక



# కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం



విజయస్ప్రే. మాంసకృత్తులు
విటమిన్లు మరియు ఖనిజ
పదార్థాలతో సమ్మిళితమైన శిశు
ఆహారం. తేలికగా జీర్ణంకాగలది
సులభంగా నీటిలో కరుగగలదు.
ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా
తయారుచేయబడింది. విజయస్ప్రేను
చాలా సులభంగా కలుపుకోవచ్చు
అంతర్జాతీయ ప్రమాణాలకు
అనుగుణంగా తయారుచేయబడిన
విజయస్ప్రే భారతదేశపు పసి
పాపలకు చాలా అనువైన శిశు
ఆహారం. విజయస్ప్రే తల్లి పాలవలె
తియ్యగా ఉండేట్లు తయా
చేయబడింది.

అవును, మీ పాప ఆరోగ్యానికి
డాక్టర్లు సిఫారసుచేసే శిశు
ఆహారం... విజయస్ప్రే!

ఆంధ్రప్రదేశ్ పాడి
పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్
లిమిటెడ్ వారి
ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం
(ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు
స్పెన్సర్ & కం. లిమిటెడ్.
(దక్షిణ ప్రాంతం)

## విజయస్ప్రే

కన్నతల్లి కలలపంట
కమ్మనయిన విజయస్ప్రే

FDS APDDC 3068 A TEL

లోకం పోకడ * డిమెన్










# ఉత్తరాలు

## పులిహోర ఆవకాయ...!

మీరు ఆంధ్ర సచిత్ర వార పత్రిక 12.6.81 సీమ ముఖచిత్రం దానిలో వంటలులో వేసిన పులిహోర ఆవకాయ అనునది చూచి చాలా విచారించినాను. ఇచ్చిన కొలతలు ఎంత మాత్రము సరియైనవి కావు. పద్ధతి కూడా కరెక్టు కాదు. ఏలనంటే— 25 కాయలు ఆవకాయ మనం పెట్టుకుంటేనే కేజీ ఉప్పు, కేజీ ఆవాలు [కొట్టగా వచ్చిన గుండ] కేజీ మిర్చి [కొట్టగా వచ్చిన గుండ] వేసెదరు. ఇది ఏ ప్రాంతంలోనైనా కామన్. కేజీ మిర్చి కొడితే –6 పావుడబ్బాల కారం వచ్చును. కేజీ ఆవాలు కొడితే— 6 పావుల ఆవ పిండి వచ్చును. మరి కాయలు 25 అని చెప్పినప్పుడు అర్థసేరు ఉప్పు, అర్థసేరు కారం ఎట్లా సరిపోవును? 25 కాయలు అన్నప్పుడు అది ఏ రకం పూరగాయ అయినా పట్టే ఉప్పు ఇంచుమించు ఒకటేగదా! పోగా. . .

[1] కాయలను కత్తిపీటతో చిన్న చిన్న ముక్కలుగా చేసుకొని ముక్కల్లో జీడితీసివేసి... అన్నారు. కాయను కత్తిపీటపై నిలువునా, అడ్డానా పనసకాయ కొట్టినట్లు కొట్టి సన్నరజను వంటి ముక్కలను కొట్టుకొని టెంకలు పారవేయాలి. ఈ కొట్టిన చిన్న చిన్న ముక్కలను కొలుచుకొని కొలతతో ఏర్పాట్లు చేసుకోవాలి.

[2] ఆవపిండి, కారం, ఉప్పు కలిపి—ముక్కలు పిండిలో వేసి కలిపి ఎత్తాలని పి. భానుమతి కాత్యాగారు వ్రాసేరు. అది సరియైన పద్ధతి గాదు. ఆనాడు కలిపి ఎత్తిననాడు అది మామూలు ఆవకాయే అగును.

[3] నూనెతో కలిపి ఎత్తాలని— జీలకర్ర వెయ్యాలని వ్రాశారు. పులిహోరలో జీలకర్ర వేసుకొందురా? అటులనే పులిహోర ఆవకాయలో వెయ్యరు.

[4] ఈ పూరగాయ ఎక్కువ నెలలు నిలువ ఉండదు— అన్నారు. అది ప్రాంతాన్నిబట్టి ఉంటుంది. కోరమాండల్ ఏరియా, సముద్రపు ఉప్పు ప్రభావం, గాలిలో తేమగల ప్రాంతాల్లో తొందరగా పూరగాయలు బూజు పడతాయి. అట్టిచోట్ల శ్రావణ మాసపు వర్షాలొచ్చేలోగా పూరగాయ అయిపోవాలి. కాని హైదరాబాద్, తెలంగాణా లాంటిచోట్ల పొడిగాలే కాని గాలిలో తేమ ఉండదు. కనుక బూజు భయం లేదు. ఇవి ప్రాంతప గమనికలు.

25 కాయలకు అరకేజీ ఉప్పు అనుట తప్పు. ఖచ్చితంగా కేజీ పట్టును.

మ. సావిత్రి నిజామాబాద్

(గత సంచిక తరువాయి)

29

# సీరియల్

# ఇంద్రసింహాసనం

స.ఆనందారామం

రాక్షసుల బారినుండి లోకాలను కాపాడిన ఘనత ఇంద్రాణికే దక్కింది. మూడు లోకాలూ ఆమె అసాధారణ ప్రజ్ఞను కీర్తించాయి. ఏనోటవిన్నా ఆమె విజయగాథే! ఏ హృదయం తట్టి చూసినా, ఆమెపట్ల భక్తి పొంగిపొర్లుతోంది! అదే సమయంలో అందరూ నహుషుణ్ని అసహ్యించుకోసాగారు. నహుషుడి భోగలాలస- విజయంతుడు, మేనక ప్రచారం చేస్తున్న వార్తలూ-పదవిలోంచి తొలగించబడ్డ యముడు చేస్తున్న ప్రచారమూ ఇందుకు దోహదాలయ్యాయి ప్రజల మనసులలో నహుషుడంటే విరక్తి ప్రబలి అందరూ వివరి మనసులలో వారు "ఇతడెప్పుడు పదవి నుండి దిగిపోతాడా?" అనుకోసాగారు.

ఇక తన ప్రణాళిక అమలు జరపటానికి నిశ్చయించుకొంది ఇంద్రాణి. దేవకన్యతో నహుషుణ్ని తన భవనానికి రమ్మని కబురు పంపింది.

ఇంద్రాణి తనంతట తాను, తనను రమ్మనందుకు పొంగిపోయాడు నహుషుడు. ఒక్కసారి మణిదర్పణం ముందు నిలబడి తన సౌందర్యం చూసుకు మురిసిపోయాడు. మీసాలు దువ్వుకున్నాడు. నగలు అలంకరించుకొన్నాడు. సుగంధద్రవ్యాలు పూసుకొన్నాడు. మధువు సేవించాడు – అప్పుడు విమానంలో బయలుదేరాడు.

మనసులో ఉవ్వెత్తున పొంగుతూన్న విరక్తిని అణుచుకొంటూ, చిరునవ్వు పులుముకొంటూ ఆదరంగా "రండి! రండి!" అని ఆహ్వానించింది ఇంద్రాణి.

"ఇన్నాళ్ళకు ఈ దాసుడి మీద దయ కలిగింది? ఇప్పుడు నేను నిజంగా ఇంద్రుడినయ్యాను."

"అప్పుడేకాదు – మన ప్రణయం ఫలించాలంటే, మీరు నా కోరిక ఒక్కటినెరవేర్చాలి."

"ఏం చెయ్యను? చెప్పు? కొండలన్నీ పిండి కొట్టనా? భూమిని స్వర్గానికి తేనా? స్వర్గాన్ని భూమి మీదకు తీసుకుపోనా? సముద్రాలన్నీ ఏకం చెయ్యనా?"

"అవేమీ అక్కర్లేదు–మీరు ఇక్కడికి మీ విమానంలో కాక మునులు లాగే రథం మీద రావాలి. స్వర్గంలోని ఋషులందరూ మీ రథం లాగాలి!"

తెల్లబోయి చూసాడు నహుషుడు.

"ఏమిటి? నేను ఎక్కిన రథం ఋషులు లాగాలా? ఇదెక్కడి వింత కోరిక?"

"నా ముచ్చట!"

"ఓస్! ఇంతేకద! అలాగే వస్తాను – ఈనాడే ఋషులను సమావేశపరచి, ఆజ్ఞాపించి రేపే వస్తాను."

"మంచిది, వెళ్ళిరండి."

"అప్పుడే వెళిపోవాలా?"

'మునులు లాగే రథం మీద వచ్చేవరకూ అంతే!"

"అదెంతసేపు?"

అహంకారంతో వెళ్ళిపోయాడు నహుషుడు –ఇంద్రాణి ఆలోచనలో పడింది. నారద మహర్షికి కబురు పంపింది. అతడు కూడా వచ్చాడు.

మునులు మేధావి వర్గాలకు ప్రతినిధులు– వారు గట్టిగా తలుచుకొంటే నహుషుణ్ని ఇంద్రపదవిలోంచి దింపెయ్యగలరు. కానీ ఈ మేధావి వర్గాలలో అదేంలక్షణమో, ఒకంతట దేనికీ పూనుకోరు– అన్నీ తెలుసుకొంటారు. అన్నీ అర్థం చేసుకొంటారు. దుర్మార్గాన్నీ దురంతాల్నీ గర్హిస్తారు–కానీ ఎదురుతిరగరు. ఏ విధమయిన చర్య తీసుకోరు. ఏదీ తమకు పట్టనట్లు ఊరుకొంటారు. లోలోపల ఎంత కుళ్ళూ, కుట్రా ఉన్నా పైకి ఏ ఆందోళనలూ లేకుండా ఉంటే, చాలనుకొంటారు.

ఇప్పుడు నహుషుడు తన రథం లాగమని వారిని కోరినప్పుడైనా వారికి పౌరుషం వస్తుందో? రాదో? అప్పటికైనా ఎదురు తిరుగుతారో, లేక అప్పటికీ 'శాంతి,' 'శాంతి' అంటారో? ఏమవుతుందో చూడాలి! ఇది తన కార్యసాధనకు ఆఖరు ఘట్టం– అందుకే నారద మహామునిని కూడా పిలిపించింది. ఏ క్షణంలో ఏ అవసరం వస్తుందోనని - దేవకన్యలు నహుషుడి భవనంలోనే మారు రూపాలలో ఉండి, ఎప్పటికప్పుడు సమాచారం అందిస్తున్నారు.

నహుషుడు మునులను సమావేశపరిచాడు. మనసులో మాట చెప్పాడు.

"నేను ఇంద్రాణిని ప్రేమించాను. ఆమె నన్ను ప్రేమించింది. కానీ, మీరంతా కలిసి లాగిన రథంలోనే తన భవనానికి రమ్మంది. నేను రథంలో కూచుంటాను – మీరంతా ఆ రథం లాగాలి."

సిగ్గువిడిచి ఇలా చెప్తున్న నహుషుణ్ని చూడలేక తలలు వంచుకొన్నారు మునులు. వాళ్ళ అభిప్రాయం కోసం ఎదురు చూడకుండానే "నేను రథం సిద్ధం చేయమని చెప్తాను. మీరు లాగటానికి సిద్ధంగా ఉండండి. నేను కొంతసేపు విశ్రాంతి తీసుకుని, అలంకరించుకొని బయలుదేరతాను" అని వెళ్ళిపోయాడు.

"ఛీ ఛీ! ఏం సిగ్గులేనితనం?" అని చీదరించుకొన్నాడు అగస్త్యుడు.

"ముల్లోకాలకూ అధిపతి అయిన ఇంద్రుడిగా ఉండి, ఇవా, ఇతడు చెయ్యవలసిన పనులు?" అన్నాడు వామదేవుడు.

"ఏ ఇంద్రుడైనా అంతేగా! ఇలాంటి దరిద్రపు పనులు చేయటానికే ఇంద్రుడు కావాలని కోరుకొంటారేమో!" విసుక్కొన్నాడు మాండవ్యుడు.

"ఇప్పుడు మనం ఏం చెయ్యాలో అది నిర్ణయించండి" అన్నాడు అత్రి

కొంతసేపు ఎవరూ మాట్లాడలేదు.

"నహుషుణ్ని ప్రతిఘటించండి – ఇతడు ఇంద్రపదవిలో ఉండటానికి అర్హుడుకాడు." సింహనాదం చేసాడు శరద్వంతుడు.

"తొందరపడకు – లోకాలను శాంతిమయంగా ఉంచవలసిన మనమే ఆందోళనలను ప్రారంభించకూడదు" అన్నాడు వసిష్ఠుడు.

"ఇంద్రాణి వ్యతిరేకిస్తే ఇది అపచారం అని ప్రతిఘటించవచ్చు - ఆవిడే రమ్మన్నప్పుడు మనమేంచెయ్యగలం? స్వర్గంలో ఇలాంటివి మామూలేగా?" అన్నాడు భరద్వాజుడు.

"ఇప్పటివరకూ దేవదానవ సంగ్రామంతో

ఎక్కడచూసినా అశాంతి తాండవమాడుతోంది. ఇప్పటికైనా శాంతి, స్థిమితం ఏర్పడేలా చూడండి'' అన్నాడు ఉద్దాలకుడు.

మునులంతా నహుషుడెక్కిన రథాన్ని ఇంద్రాణి భవనం వరకూ లాక్కెళ్ళడానికే నిర్ణయించుకొన్నారు.

అంతా వింటున్న దేవకన్యలు ఈ సమాచారాన్ని ఇంద్రాణి కందజేసారు. ఆమె తల్లడిల్లిపోయింది. "నారదమునీ! విన్నారా? నహుషుడు తన రథం లాగమన్నప్పుడు కూడా మునులకు కోపం రాలేదట! అప్పటికీ నహుషుణ్ని పదవి నుంచి దింపెయ్యాలని సంకల్పించుకోలేదట! ఏం చెయ్యగలం మనం?"

"దిగులు పడకండి-నేను అక్కడే ఉండి-మునులను రెచ్చగొట్టడానికి ప్రయత్నిస్తాను. నహుషుడు కామాంధుడు! అతడిని ప్రేరేపించి మునులను మరింత అవమానింప చెయ్యటం చాలా తేలిక."

నారదుడు నహుషుడి భవనం చేరుకునే సరికి అతడు తన రథంలో కూచున్నాడు. రథానికి పొడుగ్గా కట్టిన తాడుని తమ భుజాలమీద వేసుకున్నారు మునులు.

"ఆహా! ఏమి నా భాగ్యం? జితేంద్రియులు, తపశ్శక్తి సంపన్నులూ, అయిన మునులు ఒక మహారాజు రథం లాగటం కళ్ళారా చూస్తున్నాను. నా జన్మ తరించింది'' అన్నాడు నారదుడు. మునులు సిగ్గుతో తలలు వంచుకొన్నారు తను అవమానం మరిచిపోవటానికి అందరూ ధ్యానంలో మునిగి మౌనంగా రథం లాగటం ప్రారంభించారు

నహుషుడు మధురమైన ఊహలతో తేలుతున్నాడు నారదుడు అతడి దగ్గరకు వచ్చాడు

"నహుషా!'' అని కుదిపాడు. కలలలోంచి ఉలికిపడి, తెప్పరిల్లి "నమస్కారం'' అన్నాడు నిర్లక్ష్యంగా

"ఇంద్రాణి దగ్గరనుంచి నీకొక సందేశం''

నహుషుడి అశ్రద్ధ ఎక్కడి దక్కడ ఎగిరిపోయింది. "ఆ! ఆ! ఏమిటి సందేశం?''

"ఇంద్రాణి పది ఘడియల సమయం వరకూ నీ కోసం నిరీక్షించి, నువ్వు రాకపోతే భూలోకానికి వెళ్ళిపోతుందిట!''

ఆ మాటతో నహుషుడికి ఎక్కడలేని కంగారు పట్టుకుంది.

"మునులారా! త్వరగా లాగండి'' అన్నాడు ధ్యానంలో మునిగివున్న మునులు ఆ మాట వినిపించుకోలేదు అలవాటులేని పని కావటం వల్ల అతి నెమ్మదిగా లాగుతున్నారు. నహుషుడికి చికాకు అంతకంతకు అధికం కాసాగింది. "మునులారా! రథం త్వరగా లాగండి'' అన్నాడు అరుస్తున్నట్టు మునులు ఆ అరుపు కూడా వినలేదు. వాళ శరీరాలు రథం లాగుతున్నాయేకాని, మనసులు ఏ దివ్య పథాలలోనో విహరిస్తున్నాయి

నహుషుడు సహించలేకపోయాడు. కామాంధకారానికి అధికారదర్పం తోడురాగా, తన కాలికి కొద్దిదూరంలో ఉన్న అగస్త్యుణ్ని "ఏయ్ బక్కమునీ! త్వరగా నడు!'' అని ఒక్క తాపు తన్నాడు. అగస్త్యుడికి ధ్యానభంగమయింది. కళ్ళు తెరచి చూసాడు. శాంతం తొణికిసలాడే కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. ధర్మం ముందు అధర్మం వణికినట్లు గడగడ వణికిపోయాడు నహుషుడు.

"కామాంధుడా! వ్యర్థుడా! ఏమన్నావ్? బక్కమునినా? ఈ బక్కవాడిలో ఎంత బలం వుందో నీకు తెలియదా, బుద్ధిహీనుడా! దివ్యత్వం మాట అలా ఉంచి, మానవత్వం కూడా లేని నువ్వు సర్పంగా పడి వుండు.''

మునులందరూ కూడా కళ్ళు తెరిచారు. ఎంతో ఎంతో సహించిన ఆ మునులు ఇంతటి దుర్మదాంధత సహించలేక పోయారు. వారందరి కళ్ళు నిప్పులు కక్కుతున్నాయి. మేధావి వర్గాలే ప్రతిఘటిస్తే ఎవరు నిలవ



**జరిగినకథ - 13:** వృషపర్వపురానికి చెందిన రాక్షసరాజు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ అందం, తెలివితేటలు, ధైర్య సాహసాలు కల రాకుమారి. ఆమె, మానవ రాకుమారుడు యయాతి ఇరువురూ ఒకరినివిడిచి ఒకరు వుండలేనంత గాఢంగా ప్రేమించుకొంటారు. యయాతిని కలుసుకొని తమ నగరంపై దేవతల దండయాత్ర ఆపించమని శర్మిష్ఠను వృషపర్వుడు ఆజ్ఞాపిస్తాడు. తమ అనుబంధానికీ, రాజకీయాలకూ తండ్రి ముడిపెట్టడం ఇష్టంలేకపోయినా యయాతిని కలుసుకోవచ్చుననేభావం ఆమెకు ఆనందం కలిగిస్తుంది. ఇంద్రుడు చేసిన ఘోరాలను సహించలేక సప్తఋషులు అతన్ని పదవిచ్యుతుని గావించి, ఆ స్థానంలో యయాతి తండ్రి నహుషుడ్ని నియమిస్తారు. అతన్ని ఎలాగయినా దింపేసి మళ్ళీ ఇంద్రుడ్ని ఆ స్థానంలో నిలబెట్టాలని ఇంద్రాణి శచీదేవి ఆలోచిస్తూంటుంది. ఆమెకు నారదుడు సహాయపడతాడు. అతడు నహుషుణ్ని రెచ్చగొట్టి అగ్ని, వాయు, వరుణ, నిరృతులలో పరస్పర కలహాలూ, అధికార దాహమూ రగిలేటట్లు ప్రవర్తిస్తాడు. యయాతీ, శర్మిష్ఠలను ఒకటిగా చేస్తుంది ఇంద్రాణి. మహేంద్రుని ఆజ్ఞను ధిక్కరించాడనే నెపంతో జయంతుని యమలోకానికి పంపిస్తాడు నహుషుడు. తనకు అనుకూలుడైన వాడిని యముడి స్థానంలోఉంచి, తన కొడుకును నిర్దోషిగా నిర్ణయించేటట్లు చేస్తాడు నహుషుడు. దీనిని ముల్లోకాల ప్రజలందరూ ప్రతిఘటించడంతో జయంతుణ్నికూడా విడుదలచేయక తప్పలేదు. జయంతుడు భూలోకంలో విమానాల తయారీకి పూనుకొంటాడు శత్రువర్గంతో చేతులు కలిపి, శుక్రాచార్యుల తపసు భంగం కాకుండా అడ్డుపడిందని ఇంద్రాణిని సభకు రప్పించి, విచారణ జరిపించి అపకీర్తి పాలువుతాడు నహుషుడు. స్వర్గంలో వుండలేక భూలోకానికి వచ్చేస్తాడు యయాతి. దేవయాని దాస్యం నుండి శర్మిష్ఠను విడిపించాలనే ఉద్దేశ్యంతో దేవయానిని వివాహమాడతాడు యయాతి. కాని అతని అంచనాలు తల్లక్రిందు లవుతాయి. దేవయాని శర్మిష్ఠను భూగృహ లో బంధించుతుంది. దేవయానికి శర్మిష్ఠపై గల కోపానికి కారణం యయాతికి చెప్తుంది శర్మిష్ఠ పరిచారిక వినత. ఆ తరువాత శర్మిష్ఠను విడుదల చేస్తుంది దేవయాని, దేవకన్య చెప్పగా. దేవయాని దేవలోకానికి వెళ్ళిన సమయంలో శర్మిష్ఠను వివాహమాడతాడు యయాతి. ఈ విషయం తెలుసుకొన్న దేవయాని తన తండ్రి దగ్గరకు పోతుంది. ఇంద్రాణికోరికపై దేవదానవ యుద్ధంలో పాల్గొనటానికి ఆమెతో దేవలోకానికి పోతాడు యయాతి. యుద్ధంలో రాక్షసులు పరాజయంపాలౌతారు. శుక్రాచార్యుల శాపం కారణంగా యయాతి వృద్ధుడవుతాడు. తన తండ్రి ముసలితనాన్ని తను స్వీకరించి అతనికి తన యవ్వనాన్ని ఇస్తాడు పూరుడు. తరువాత రాజ్యరక్షణ కోసం జరిగిన యుద్ధంలో తన పూర్వపుయవ్వనాన్ని తిరిగి పొందుతాడు.



గలరు? మునుల క్రోధ జ్వాలలకు ఆహుతయి పోయాడు నహుషుడు

## 30

నహుషుడు పతనం కాగానే మొదట అగ్ని ఇంద్రపదవి'లోకి వచ్చాడు. అది వాయువు సహించలేక పోయాడు. అప్పటి వరకూ నహుషుణ్ని దింపటానికి మాత్రమే అగ్ని, వాయువులు ఒకటయ్యారు. అగ్ని పదవిలోకి రాగానే, అతడిని దింపి తానే ఇంద్ర పదవిలోకి రావాలనుకున్నాడు వాయువు. భూలోకానికి వెళ్లి మేనకా, జయంతుడినీ, పదవి పోగొట్టుకున్న యముణ్ని కలుసుకుని సంప్రదింపులు జరిపాడు. "నేను ఇంద్ర పదవిలోకి వస్తే నీ పదవి నీకిస్తాన"ని యముడికి ఆశపెట్టాడు. ఆ ముగ్గురూ వాయువును ప్రోత్సహించారు. మేనక ఉత్సాహంగా "నువ్వూ, అగ్ని చాలా సన్నిహితులు కదా! అతని రహస్యాలేవైనా ఉంటే చెప్పు. నా నాట్యం ద్వారా అవన్నీ అన్ని లోకాల లోనూ ప్రచారం చేస్తాను" అంది. వాయువు "అతని లోపాలు ఎన్నని చెప్పను? ఇటు శీలమూ మంచిది కాదు. పరాక్రమమూ అంతంత మాత్రమే! సప్త ఋషుల పత్నులను మోహించిన కథ జగత్ప్రసిద్ధమే? అదికాక దుర్యోధనుడనే మనువంశ రాజు కుమార్తె సుదర్శనను మోహించి, బ్రాహ్మణరూపంలో వెళ్లి తనను పెళ్లి చేసుకోమని అడిగాడు. ఆ అమ్మాయి భయపడి తండ్రికి చెప్పుకుంది మొత్తం మీద ఎలాగో దేవతలందరూ కల్పించుకొని, వాళ్లిద్దరికీ పెళ్లి జరిపించారు. ఇక పరాక్రమం సంగతి చెపుతాను వినండి. మరుత్తు అనే రాజు సంవర్తుడిని ఋత్విజుడుగా చేసుకొని యాగం చెయ్యాలనుకొన్నాడు. ఇంద్రుడు తన మామూలు పద్ధతి ప్రకారం ఆ యాగం పాడుచెయ్యాలనుకొన్నాడు. అతడు అగ్నిని పిలిచి "నువ్వు మరుత్తు దగ్గిరికి వెళ్లి సంవర్తుడు యాగం బాగా చేయించలేడు... బృహస్పతిని పిలిచి యాగం బాగాచేయించుకో! అని చెప్పు" అని అగ్నిని మరుత్తు దగ్గిరకు పంపాడు. అగ్ని వెళ్లి ఇంద్రుడి మాటలు చెప్పగానే సంవర్తుడు మండిపడ్డాడు.

ఓ అగ్నీ! నువ్విక్కడికి వచ్చావంటే నిన్ను మాడ్చేస్తానని చెప్పాడు. అక్కడితో అగ్ని భయపడిపోయి స్వర్గానికి పారిపోయి వచ్చేశాడు. అంతేకాదు. ఈ అగ్ని ఎక్కువినయాలతో వెనకాల గోతులు తవ్వే రకం. ఇంద్రుడి ముందు "చిత్తం! చిత్తం!" అంటూనే అతడి ఖాండవ వనాన్ని భక్షించా



## ఇంద్రసింహాసనం

అని చూసాడు. కుదరలేదు. సమయంకోసం కాచుకుని ఉన్నాడు'' అని అగ్ని బండారమంతా బయట పెట్టాడు. ఆ తరువాత అష్టమి తుడిలా అగ్నిని చేరుకొన్నాడు. చిత్రకేతుడూ, విచిత్రరథుడూ అగ్ని ఇంద్రుడు కాగానే అతడి పక్షంచేరి అతడు ఏంచేస్తే అది మహాద్భుతమని గానం చెయ్యసాగారు. చిత్రకేతుడు తన పతాకాన్నీ, విచిత్రరథుడు తన రథాన్నీ మార్చేసుకొన్నారు

మేనక అగ్ని రహస్య గాథలన్నీ తన నాట్యంద్వారా లోకాలకు బట్టబయలు చేసింది. అందరూ అగ్నిని అసహ్యించుకొన్నారు. మునులందరూ ఏకమై అగ్నిని ఇంద్రపదవి నుంచి దిగిపొమ్మన్నారు. అగ్ని దిగిపోయాడు. వాయువు 'ఇంద్రసింహాసనం' మీదకూచున్నాడు.

చిత్రకేత, విచిత్రరథులిద్దరూ అత్యంత వేగంతో పతాకాన్నీ, రథాన్నీ మార్చేసుకొని, కొత్త రాగంలో సరికొత్త పాట ప్రారంభించారు.

వరుణుడు మాత్రం వాయువు ఇంద్రుడు కావటం సహించలేకపోయాడు. దిక్పాలకులలో అతడేమంత మహానుభావుడని అతడికి ఇంద్రపదవి రావాలి? మిగిలిన దిక్పాలకులను కదిపి చూపాడు. కొత్తగా వచ్చిన యముడికి తన పదవి నిలుపుకోవాలనే తాపత్రయం తప్ప మరొకటిలేదు. అంచేత ఇంద్రపదవిలో ఎవరుంటే వాళ్ళను స్తోత్రం చెయ్యటంతప్ప, తిరుగుబాటు చెయ్యటానికి సిద్ధంగాలేడు. ఈశానుడు శివుడి అంశ ఉన్నవాడు. శివుడి ఆజ్ఞకు బద్ధుడే కాని స్వతంత్రించి ఏమి చెయ్యడు. కుబేరుడికి ఇంద్రపదవి అక్కర్లేదు. అతడికి తన వ్యాపారమే ఇంద్రపదవి కంటె ఎక్కువ. ఇంద్రపదవిలో ఎవరుంటే వారికి పెట్టుబడి పెట్టి తన వ్యాపారానికి అడ్డంకులు లేకుండా చేసుకోవటమే అతనికి కావలసింది. నిర్‌ఋతి కూడా తన పదవి తనకు నిలిస్తే చాలనే ధోరణిలోనే ఉన్నాడు. ఇక వరుణుడు కూడా మేనకా జయంతులనూ, యముడినీ ఆశ్రయించాడు. వాయువు రహస్యాలన్నీ అతడు బయట పెట్టాడు అతడు పరాక్రమంలో ఆది శిశువుతో ఓడిపోయాడు. ఇక శీలం కూడా అంతంత మాత్రమే! కుశనాభుడి పుత్రికల దగ్గరకు వెళ్ళి తనను పెళ్ళి చేసుకోమని అడిగాడు. వాళ్ళు ఒప్పుకోలేదు. ఇలాంటివే

మరికొన్ని ఈ విషయాలు కూడా వెనుకటి లాగే అన్ని లోకాలలోనూ ప్రచారమయ్యాయి. వాయువు కూడా ఇంద్రపదవి దిగిపోవలసి వచ్చింది వరుణుడు 'ఇంద్రు'డయ్యాడు.

ఇప్పుడు వరుణుడి మీద పగతీర్చుకోవటానికి అగ్ని వాయువు లిద్దరూ ఏకమయ్యారు.

ఉచథ్యుడు నదికి స్నానానికి వెళ్ళినపుడు వరుణుడు అతని భార్యను ఎత్తుకుపోయాడు. ఈ సంగతి నారదుడు ఉచథ్యుడితో చెప్పాడు. ఉచథ్యుడు వరుణుడికి తగిన శాస్తి చేసి తన భార్యను తీసుకపోయాడు

అగ్ని వాయువులు ఈ రహస్యాన్ని బట్టబయలు చేసి ఇలాటి అల్లుడు ఇంద్రుడుగా ఉండటానికి అర్హుడు కాదన్నారు.

మూడు లోకాలనూ సమర్థంగా పాలించగల వారెవ్వరని అందరూ విచారంలో పడ్డారు. చివరకు కొన్ని లోపాలున్నా వెనుకటి ఇంద్రుడే సమర్థుడని నిర్ణయించుకొని అజ్ఞాతవాసంలో ఉన్న అతడిని అన్వేషించమని భటులనూ, గూఢచారులనూ అన్నివైపులకూ పంపారు. తాత్కాలికంగా ఇంద్రాణిని 'ఇంద్ర సింహాసనం' మీద నిలిపారు.

ఇంద్రాణి సింహాసనం మీదికి రాగానే చిత్రకేత, విచిత్రరథులిద్దరూ తమ పతాకాన్నీ రథాన్నీ మార్చేసి, ఇంద్రాణి ముందుకువచ్చి నిలబడ్డారు.

"గంధర్వ వీరులారా! మీరిద్దరూ హిమాలయ సరిహద్దుల్లో సర్వాధికారికి సహాయకులుగా ఉండండి" అని నియమించింది ఇంద్రాణి.

తమకు పెద్ద పదవులు వచ్చాయని మురిసిపోయిన ఇద్దరూ హిమాలయ సరిహద్దులలోకి వెళ్ళారు. అక్కడి సర్వాధికారి వీళ్ళని గౌరవంగా ఆహ్వానించి ఉండటానికి భవనం చూపించాడు అంతే! వాళ్ళకు చెయ్యవలసిన పనిలేదు వచ్చేరాబడీలేదు. అందే మర్యాదలేదు తమ ఉద్యోగాలు మేడిపండు వంటివని ఇద్దరూ గ్రహించుకొన్నారు. అంతేకాదు తమను ఉద్యోగాల వంకతో స్వర్గానికీ, స్వర్గంలో రాజకీయాలకూ దూరంగా ఉంచిందని కూడా గ్రహించారు. ఇన్నాళ్ళు ఎంతో శ్రమపడి విప్పటికప్పుడు జెండాలూ, రథాలూ మార్చినందుకు ఇదా ఫలితమని నీరసపడిపోయారు "హన్నా! ఇంద్రాణి?" అని, మనసులో పళ్ళు నూరుకొని పైకి గడగడలాడిపోయారు అంతకంటె ఏం చెయ్యగలరు?

## 31

పూరుడి పట్టాభిషేకం మహా ఘనంగా జరుగుతోంది. మేళతాళాలు మిన్నంటుతున్నాయి. మణి తోరణాలూ, ముత్యాల ముగ్గులూ మొదలైన అలంకారాలతో రాజభవనం కళకళలాడుతోంది. విందులు, వినోదాలు, కర్రసాము, కత్తిసాము మొదలైన వ్యాయామక్రీడలు, పాటకచ్చేరీలు, నాట్య ప్రదర్శనలు మొదలైన వాటితో చాలా సందడిగా, కనుల పండువుగా, ఉత్సాహం వెల్లివిరుస్తూ ఉంది రాజధాని. ప్రజలంతా ఆనంద కోలాహలంలో ఉన్నారు.

రాజభవనం సరేసరి. ఒక మందిరంలో ప్రాయంలో ఉన్న రాకుమార్తెలు నృత్య గానాలలో తమకున్న ప్రతిభను పరస్పరం ప్రదర్శించుకొంటున్నారు. ఏవేవో హాస్యాలతో కిలకిల నవ్వుకొంటున్నారు. ప్రాంగణాలలో దాసీలు పువ్వులు కుప్పలుగా పోసుకొని మాలలు కడుతున్నారు అంతర్భవనంలో ఒక ప్రత్యేకించిన గదిలో అలంకరణలో నిపుణులైన పరిచారికలు రాజవంశపు స్త్రీలను వారు కోరిన విధంగా అలంకరిస్తున్నారు. కేశాలంకరణలో తమ తమ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు కొందరు రాణులు శర్మిష్ఠ చుట్టూ చేరి, ఒకరితో ఒకరు పోటీలు పడుతూ శర్మిష్ఠను ప్రశంసలతో ఉబ్బించటానికి ప్రయత్నిస్తున్నారు. ఈ రాణులే ఒకప్పుడు శర్మిష్ఠ ముఖం కూడా చూడకుండా దేవయాని చుట్టూ తిరిగే వారు. వీరందరికీ వయసులో ఉన్న కుమార్తెలున్నారు. ఎవరికి వారే పూరుడు తమ కుమార్తెను వివాహం చేసుకొంటే బాగుండునని ఆశపడుతున్నారు.

ఈ ప్రశంసలకు శర్మిష్ఠ ఉబ్బిపోవటం లేదు చిత్రమైన కాలగతిని వింతగా చూస్తూ కూచొంది ఇంతటి ఆనంద కోలాహలం మధ్య ఏ విధంగానూ ఎందులోనూ కలవక తన భవనంలో ఒంటరిగా ఉన్నది దేవయాని మాత్రమే! ఏనాడూ లేనిది ఆమె పరిచారికలు కూడా ఆమెను వదిలిపోయారు. ఊరించే ఆనందం, కోలాహలానికి దూరంగా ముతి ముడుచుకు కూచున్న తమ రాణి దగ్గర వారు ఉండలేకపోయారు. దేవయాని ఒంటరిగా ఉంది. ఎప్పటిలా కిటికీలోంచి చూస్తోంది. కానీ, ఆమెకు ఎప్పటిలా శూన్యం కనిపించటంలేదు. కాగడాల వెలుగులు — మంగళ తూర్యనాదాలు, చీని చీనాంబరాలతో, వయ్యారంగా తిరుగాడే స్త్రీజనం, గుర్రాలను పరుగులెత్తించే భటులు, ఈ సందడి ఆమెకు తప్పించుకొందామన్నా వదలటంలేదు. ఆమె మనను విషాదంగా ఉన్నదని చెప్పటానికిలేదు— ఆమె కూడా శర్మిష్ఠలాగే చిత్రమైన కాలగతిని విచిత్రంగా చూస్తోంది.

తానెందుకిలా అయింది? తనకేమి తక్కువయింది? తన తండ్రికి అపారమైన తపశ్శక్తి ఉంది. తానేది కోరుకుంటే అది



జరిపించగలడు తండ్రి తన కోరిక నెరవేరక పోవటమంటూ ఇంతవరకూ జరగలేదు. కానీ తన జీవితం ఎందుకిలా వ్యర్థ మయ్యింది? ఇంత జీవితంలో ఈనాడు వెనుదిరిగి చూసుకొంటే ఒక్క మధురస్మృతి అయినా లేదే? ఏదో విస్తారమైన ఎడారి నుంచి నడిచివచ్చినట్లుంటుందే? ఏది కారణం దీనికి?

శర్మిష్ఠ కచుడికి సన్నిహితం కాకూడదని శతవిధాల ప్రయత్నించింది. కానీ కచుడు శర్మిష్ఠనే మెచ్చుకొన్నాడు. సాధారణ బ్రాహ్మణ కన్య, కలలో కూడా ఊహించలేనిది తను సాధించింది. యయాతి మహారాజును పెళ్ళి చేసుకొంది. రాకుమార్తెగా జన్మించిన శర్మిష్ఠను తన దాసిగా చేసుకొంది. ఆ శర్మిష్ఠ ప్రేమించిన యయాతిని - శర్మిష్ఠను ప్రేమించిన యయాతిని ముసలివాడిగా మార్చేసింది. కానీ, ఏం సాధించింది?

శర్మిష్ఠ— అసూయతో తను అధః పాతాళానికి అణిచెయ్యాలని ప్రయత్నించిన శర్మిష్ఠ— ఈనాడు దాసికాదు. యయాతి ముసలివాడు అయినా ఆమె ప్రణయం భగ్నం కాలేదు. ఈనాడు యయాతి ముసలివాడు కాడు. ఆమె కొడుకు పూరుడికి యువరాజ్యాభిషేకం జరుగుతోంది. ప్రజలంతా ఆమెను కీర్తిస్తున్నారు. ఈనాడు అన్ని లోకాలలో శర్మిష్ఠ కంటె అదృష్టవంతురాలు లేదు. ఎందుకిలా జరిగింది? ఎక్కడుంది ఈ రహస్యం? తపశ్శక్తినికూడా మించిన మరేదో మహత్తరశక్తి ఈ జగత్తును పాలిస్తోంది. అదేదో శర్మిష్ఠ అందుకోగలిగింది. ఏమిటది?

వెనుక అడుగుల చప్పుడు వినిపించి పరిచారిక ఎవరో తనకు ఆహారం తెచ్చి ఉంటుందనుకొని వెనుదిరిగి చూడకుండా అలాగే నిలబడింది.

"దేవయానీ!"

ఉలికిపడింది దేవయాని. అది శర్మిష్ఠ పిలుపు. చిన్నతనంలో కల్లాకపటం ఎరుగక ఆడుకొనే రోజుల్లో అలా పేరు పెట్టి పిలుచుకొనేవారు. కాలం గడిచినకొద్దీ స్పర్ధలు పెరిగి ఆ చనువు పోయింది. కిటికీని వదలి ఇటు తిరిగింది దేవయాని. అలసట నిండిన ముఖంతో నిలబడి ఉంది శర్మిష్ఠ. సాధారణ వస్త్రాలకు బదులు పట్టుచీర, కొన్ని నగలూ తప్ప వెనుకటి శర్మిష్ఠకూ ఈ శర్మిష్ఠకూ పెద్ద భేదంలేదు. కాషాయరంగు చీరలో నిరాసక్తంగా నిలచిన దేవయానిని చూసి

---

## కర్తవ్యం

అమ్మాయిగారూ!
హైహీల్స్ వేస్తేనే
మగాడంత ఎదిగినట్లు కాదు.
బెదిరించిన మగాన్ని చూసి
చెప్పులు చేతుల్లో పట్టుకొని పరుగుతీయకు.
హైహీల్స్‌తోనే దవడలకు బుద్ధి చెప్పు.
బెదిరిస్తే బెదరక ఎదిరించు!!

— ఎన్. సంజీవి

---

## ఇంద్రసింహాసనం

చాలా జాలి కలిగింది శర్మిష్ఠకి జ్ఞానం వచ్చిన నాటి నుండీ దేవయానిని అలా చూడలేదు.

శర్మిష్ఠను చూస్తూ నిలబడింది దేవయాని పలకరించకుండా. ఆహా! ఏం దేవయాని? ఇప్పటికీ ఆమే తనకు యజమానురాలైనట్లుగా ఉంది

"దేవయానీ! నన్ను క్షమించు. నీ భర్తను నేను ప్రేమించటం అపరాధమే! కానీ నేనాయనను అంతకు ముందు నుండీ ప్రేమించాను. ఆయన నన్ను విముక్తురాలిని చేయటానికే నిన్ను వివాహం చేసుకొన్నానని అన్నారు నేను నమ్మాను నమకుండా ఉండలేను. ప్రేమలో ఉన్న బలహీనత అదే!

కానీ...కానీ...నన్ను నమ్మి. నీకు అపకారంచేసే ఉద్దేశం నాకు లేదు "మరొకరికి అపకారం చెయ్యాలని నేనెప్పుడూ అనుకోను." ఈనాడు పూరుడు యువరాజు కావటానికి కారణం కూడా నా అభ్యర్థన కాదు— ఆ ముసలితనం గొడవల కారణంగా వచ్చిన పరిణామం ఇది. నా వల్ల కానీ, నా కొడుకుల వల్ల కానీ, నీకూ నీ సంతానానికీ ఏ ఇబ్బందులూ రావు నన్నుక్షమించి ఉత్సాహానికిరా?"

దేవయానికి మెరుపు కొట్టినట్లయింది.

"నేను మరొకరికి అపకారం చెయ్యాలని అనుకోను!" ఇందాకటి నుంచీ తను మథన పడుతున్న విషయానికి సమాధానం దొరికింది! "మరొకరికి అపకారం చెయ్యాలని సంకల్పించకపోవటం!" శర్మిష్ఠ విజయంలోని రహస్యంఇదే! తపశ్శక్తిని మించిన అద్భుతమైన నైతికశక్తి ఇదే!

తండ్రి తపశ్శక్తిని ఉపయోగించుకొంటూ తాను మొదటి నుంచీ ఇతరులకు అపకారాలనే చేసింది. ఫలితంగా ఇలా శూన్యంలో ఒంటరిగా నిలబడింది శర్మిష్ఠ. తన నైతిక శక్తితో ఏ తపశ్శక్తులకూ అందని నిత్యనవ ప్రేమమయ జగత్తులో నిలిచి ఆనందమయిగా వెలుగుతోంది.

"దేవయానీ! నన్ను క్షమించలేవా?" చిన్నబోయిన ముఖంతో అడిగింది శర్మిష్ఠ.

అంత సేపటికి దేవయాని నవ్వింది.

'శర్మిష్ఠా! నేను నిన్ను క్షమించనవసరం లేదు — నువ్వు నన్ను క్షమించమని అడక్కర్లేదు ఎందుకంటే— విధి నా తరఫున నీకు పరిహారం చెల్లించింది నాకు పాఠాలు నేర్పింది."

శర్మిష్ఠ మాట్లాడలేదు. దేవయాని మొదటినుండీ శర్మిష్ఠకంటే తెలివిగలది. పండితురాలు.

"పదా పద..." అని బయలుదేరింది.

శర్మిష్ఠ ఆశ్చర్యంగా "అలంకరించుకోవా" అంది

దేవయాని వింత అలంకరణప్రియురాలో శర్మిష్ఠకు తెలుసు. దేవయాని నవ్వి "ఏం? నేను అందంగా లేనా?" అంది. నిజంగానే ఏ అలంకారాలూ లేకుండా కూడా దేవయాని వింతో అందంగా ఉంది. వడలిపోయిన ఆమె ముఖం ఏదో వింత కాంతితో మెరుస్తోంది.

శర్మిష్ఠ, దేవయాని జంటగా రావటం చూసిన రాణుల నోళ్ళు మూతపడిపోయాయి. అప్పటివరకూ వారు దేవయానిని నిందిస్తూ శర్మిష్ఠ మెప్పు పొందాలని ప్రయత్నిస్తున్నారు ఆ ఇద్దరినీ చూసి ఏంమాట్లాడాలో ఎవరికీ తోచలేదు. దేవయాని తానే చిరునవ్వుతో అందరినీ పలకరించింది. పురోహితుల ఆదేశానుసారం దీక్షితుడై హోమాలు చేస్తున్న పూరుడు హోమం ఆపి, లేచివచ్చి, తల్లులిద్దరికీ నమస్కరించాడు. "చిరంజీవ!" అని ఆశీర్వదించింది దేవయాని. శర్మిష్ఠ మౌనంగా అతడి శిరసు నిమిరింది.

ప్రసిద్ధ జ్యోతిష్కులు నిర్ణయించిన శుభ ముహూర్తానికి పూరుడికియువరాజ్యాభిషేకం జరిగింది. రత్నఖచితమైన బంగారు సింహాసనంమీద కూచోబెట్టారు. వేదమంత్ర పఠనంతో, పుణ్యనదీ జలాలతో అభిషేకం చేసారు. మహారాజులు ధరించే దుస్తులు ధరింపచేసారు. మహారాజ కిరీటాన్ని అతని శిరస్సుపై అలంకరించారు. ఆ కిరీట కాంతితో ఆ ప్రదేశమంతా ధగధగలాడింది. పురోహితులు వేద మంత్రాలతో ఆశీర్వచనాలు పఠించారు. పెద్ద ముత్తయిదువులు మంగళ హారతులు పాడారు సభకు వచ్చినవారందరూ ఆశీస్సులతో అక్షతలు చల్లారు. ఆ సభకు ఇంద్రాణి స్వయంగా వచ్చి పూరుడిని ఆశీర్వదించింది. దేవయానిని దగ్గరకు తీసుకుని "ఈ ఉత్సవం అయిపోయాక నీ భవనానికి వస్తాను" అంది. దేవయాని మాట్లాడలేదు.

సామంతులొక్కొక్కరూ వచ్చి తమ ఖడ్గాన్ని పూరుడి పాదాల ముందుంచి కానుకలు సమర్పించి పోతున్నారు. భటులు ఆ కానుకలందుకొని, సమర్థులైన కొందరి ఆధ్వర్యంలో సామాన్య ప్రజలకు సమానంగా పంచుతున్నారు.

వైభవంగా ఉత్సవం ముగిసింది. దేవయానితో ఇంద్రాణి కూడా దేవయాని భవనానికి వచ్చింది. దేవయాని ఇక ఆణచుకో లేక అడిగేసింది.

"అమ్మా! కావలసిన దానివని నిన్ను నమ్మాను. నువ్వే నాకు అపకారం తలపెడతావా?"

ఈ ప్రశ్న కోసమే ఎదురు చూస్తోంది ఇంద్రాణి. దీనికి సమాధానం చెప్పే అవకాశం కోసమే దేవయాని వెంట వచ్చింది.

"దేవయానీ! నీమీద నాకు వాత్సల్యంతప్ప మరొక భావం లేదు. నీకు అపకారంచేసానా? లేదు ఆలోచించుకో! నిజంగా నువ్వు భర్తగా భావించిన వ్యక్తి నుండి నిన్ను దూరం చేసానా? చెయ్యగలిగానా?"

దేవయానికి అర్థమయింది. మాట్లాడలేదు.

"శర్మిష్ఠను నేనొకనాడు నా రాజకీయ ప్రయోజనం కోసం వాడుకున్నాను. ఆ అమాయకురాలు వేదనలన్నీ మౌనంగా భరించింది. ఆమె ఏనాటికైనా యయాతిని చేరుకోగలదని నేను ఆ నాడే వాగ్దానం చేసాను. తాత్కాలికంగా కష్టాలెదురయినా, ఆమె ప్రణయం ఫలిస్తుందని కూడా వరమిచ్చాను. ఏదీ ఆశించకుండా దేనికీ ఎదురు తిరగకుండా తన ప్రేమనే ఆధారంగా చేసుకుని బ్రతికింది. ఆ ప్రణయిని నీకు అన్యాయం జరగలేదు. శర్మిష్ఠకు న్యాయం జరిగింది. ఇక పూరుడు ఈనాడు మహారాజా కావడానికి కూడా నువ్వే బాధ్యురాలివి. నువ్వు యయాతికి తెప్పించిన ముసలితనం కారణంగానే పూరుడు రాజు కాగలిగాడు."

"ఇక యదువూ, యదువు వంశం వారూ ఎప్పటికీ రాజులు కాలేరా" తల వంచుకొని అడిగింది దేవయాని.

"భవిష్యత్తులో యాదవ వంశాన ఒక మహానుభావుడుద్భవిస్తాడు — వ్యక్తి పూజను మానిపిస్తాడు. సమసమాజం స్థాపిస్తాడు — జీవనరణరంగంలో ప్రాణికర్తవ్యమేదో నిరూపిస్తాడు— రాజాధిరాజై లోకానికంతకూ



పూజ్యుడవుతాడు సామాన్యులకు సహితం ప్రేమపాత్రుడవుతాడు''

"యాదవు ఈ రకంగా వ్యర్థుడు కావటానికి కారణం నేనే! తలిదండ్రుల ప్రేమలో తప్ప పిల్లలు సరిగా పెరగరు''

అన్ని రోజులకి తన తప్పు ఒప్పుకొంది దేవయాని

ఆ సమయంలో కుమార్తెను చూడాలని శుక్రుడూ, అతడి వెంట వృషపర్వుడూ దేవయాని మందిరానికి వచ్చారు శుక్రుడి ముఖంలో వెనుకటి తేజస్సులేదు. అతడి తపశ్శక్తి అంతా వ్యయమై పోయింది అతడి ముఖం బాగా వడిలిపోయి దీనంగా దయనీయంగా వుంది. దేవయాని తండ్రి ముఖం చూసి చాలా బాధపడింది తనకోసం తన సుఖంకోసం పరితపించి, తను కోరినదల్లా చేసి ఇలా అయిపోయాడు ముందుకు వెళ్ళి తండ్రి పాదాలకూ, ఆ తర్వాత వృషపర్వుడి పాదాలకూ కూడా నమస్కరించింది వృషపర్వుడు ఉబ్బిబ్బైపోయాడు. దేవయాని అంతకు ముందెన్నడూ అలా నమస్కరించలేదు.

శుక్రాచార్యులూ, వృషపర్వుడూ వచ్చారని విని శర్మిష్ఠ, యయాతి, పూరుడు కూడా వచ్చారు.

శర్మిష్ఠ కూడా ఇద్దరికీ నమస్కరించింది. శుక్రుడు "సుఖీభవ!'' అని ఆశీర్వదించాడు. వృషపర్వుడు ఆనంద బాష్పాలు తుడుచుకుంటూ, లోలోపల ఆశీర్వదించుకొన్నాడు. మనవడిని దగ్గరకి తీసుకొన్నాడు

శుక్రుడు "అమ్మా! దేవయానీ! నేను మళ్ళీ తపస్సుకు వెళ్తున్నాను, ఇప్పుడు నీ భర్త వృద్ధాప్యం పోయింది కదా! సుఖంగా జీవించు'' అన్నాడు.

అంతటి తపస్వి అమాయకత్వానికి నవ్వుకొంది దేవయాని.

"ఇంక మీదట సుఖంగా జీవించటానికే నిర్ణయించుకొన్నాను నాయనగారూ! నేనూ మీతో తపస్సుకు వస్తాను'' శుక్రుడు తల్లడిల్లిపోతూ "అయ్యో! పిచ్చితల్లీ! నువ్వు తపస్సుకు రావటం దేనికమ్మా! నీకు ఏం కావాలో చెప్పు. నేను తపస్సు చేసి సాధించి పెడతాను'' అన్నాడు.

"లాభంలేదు నాయనగారూ! ఇది నేను నా తపస్సువల్ల మాత్రం సాధించుకోవాలి.


ఆరోగ్యం, మజా, జోరూ తోడు జోడుగా
SPECIAL REFILL PACK
save Re.1/-
Cadbury's
Bournvita
The tastier food drink
500 g net
Cadbury's
Bournvita
The tastier food drink
OBM 6617 TL
మీ కుటుంబానికి రుచికరమైన బోర్న్‌విటా యివ్వండి.
బోర్న్‌విటాలో ప్రకృతిలోని మంచి లక్షణాలుగల కోకో,
మాల్ట్, పాలు, పంచదార సమృద్ధిగా వున్నాయి.
ఇప్పుడు! ఎంతో పొదుపు పూర్తిగా ఒక రూపాయి
పొదుపు రీఫిల్ ప్యాక్ కొన్నప్పుడు
బోర్న్‌విటా
దీనిలోని మంచి లక్షణాలన్నీ మీకోసం

# వెల్లుల్లి "పాయ" "కూరగాయా?" ధర్మ మీమాంస!

కూరల్లోను మసాలల్లోను ఆరోగ్యం కోసం రుచికోసం వేసుకొనే "వెల్లుల్లిపాయ" పెద్ద మీమాంస తీసుకొచ్చింది! ఈ వ్యవహారం కోర్టు కెక్కింది... వెనకటికి ఇటలీలో యిలాంటిదే ఓ తమాషా జరిగింది. అప్పుడు నీరుల్లిపాయ కోర్టు కెక్కింది. ఆదివారంనాడు పండ్లు అమ్మవచ్చును గాని కూరగాయలు అమ్మరాదు అన్న ఆంక్ష వుండేదిట. కాని మార్కెట్‌లో ఓ ముసలమ్మగారు ఉల్లిపాయలు అమ్ముతూవుంటే పోలీసులు పట్టుకున్నారు. కేసు పెడతామన్నారు. ఉలిపాయల అవ్వ "నాకు పండ్లు అమ్మే అధికారం వుంది. కనుక నేను ఉల్లిపాయలు అమ్ముతున్నాను" అని వాదించింది.

"కాయగూరని పట్టుకొని ఉల్లిపాయ అంటూందేం ఈమె?" అని—'యిటలీ' పోలీసులు కనుక కాస్త పెద్దరికంగా ఆ ముసలమ్మని అడిగారు. 'పండ్లు ఎవరైనా వుడక పెట్టకుండా తింటారు కదా...యిదుగో యీవుల్లిపాయని విందరో పచ్చిదే తింటారు— "మందు" భాయీలు కూడా దీన్ని "అనుపానం"గా వాడుతారు' అన్నదట.

మాజిస్ట్రేట్‌గారు ముసలమ్మగారి పక్షంగా తీర్పు యిచ్చారట.

అట్లాగ యిప్పుడు కేరళ రాష్ట్రంలో వెల్లుల్లిపాయ హైకోర్టు కెక్కింది. కూరగాయలకి అమ్మకం పన్నులేదు. అందుచేత వెల్లుల్లిపాయ కూడా కూరగాయ అన్న "మిష" మీద వర్తకులు తెల్లవుల్లిపాయకి సేల్సుటాక్సు కట్టనవ్ అంటున్నారట!

"సరే అట్లాగే" అని సేల్సుటాక్సు మీద వచ్చే ఫిర్యాదులని విచారించే "అప్పిలేట్ ట్రిబ్యునల్" వారు తీర్పు చెప్పారు.

కాని రాష్ట్ర 'రెవిన్యూబోర్డు'వారు యీ తీర్పు నొప్పుకోలేదు. హైకోర్టుకి అప్పీలు చేశారు.

హైకోర్టువారు – యీ "మీమాంస"ని తిరిగి 'అప్పిలేట్‌ట్రిబ్యునల్'కి పంపించారు... పంపిస్తూ ...

(1) వెల్లుల్లిపాయి మామూలుగా యిండల్లో వేసుకొనే కూరగాయల తోటలలో పెంచుతున్నారా? అట్లా సాధ్యమా?

(2) ఇది వాడే యిల్లాలు దీన్ని కూరగాయల జాబితాలో చేర్చుతున్నదా? లేక వేరే సరుకుల లిస్టులో వేస్తున్నదా?

(3) దీన్ని కూరగాయలు అమ్ముకునే వాళ్ళు అమ్ముతున్నారా! లేక యితరసరకులు అమ్మే "వెచ్చాలకొట్టు"లో విక్రయిస్తున్నారా? అన్న యీ "ప్రాతిపదికల" మీద బాగా పరిశీలించి తెల్లిఉల్లిపాయి కూరగాయౌతుందీ కానిదీ తేల్చమన్నారుట?

ఇంతకీ "ఆంధ్ర సచిత్ర వారపత్రిక" పాఠకులు ఏమంటారో?!...

[– వీరాజీ]

## ఇంద్ర సింహాసనం

నేను తపస్సమాధిలో వుంటే, నాకు సమాధిలో ఉన్న కచుడు కనపడతాడు. అలా అతని దర్శనం చేసుకొంటూ మిగిలిన జీవితం తపస్సులో గడుపుతాను."

తెల్లబోయాడు శుక్రుడు. ఇది అతని ఊహకందనిది. దీనికి సమాధానం అతని దగ్గిరలేదు.

యయాతి తల దించుకొన్నాడు. శర్మిష్ఠ, ఇంద్రాణి జాలిగా చూసారు.

దేవయాని కఠిన తపశ్చర్యకు పూనుకోడం శుక్రుడు కిష్టంలేదు. కానీ, ఈ విషయంలో కూడా అతడు కూతురి మాట కాదనలేక పోయాడు. తన కమండలం పట్టుకొని లేచి "పదమ్మా" అన్నాడు. వంటిమీద మిగిలిన కొద్ది అలంకారాలు కూడా తీసేసి పరిచారికల కిచ్చేసి తండ్రివెంటబయలుదేరింది దేవయాని.

వృషపర్వుడు బిక్క ముఖం వేసుకొని, "మహర్షీ! మీరింక అరణ్యాలలోనే వుండి పోతారా?" అన్నాడు. శుక్రుడు ఆగి వెనక్కి తిరిగి "దేవయాని అరణ్యాలలోనే ఉండి పోతుంది. కానీ, నేను శత్రువులు సాధించి నీ దగ్గిరకి తిరిగి వస్తాను" అని వెళ్ళిపోయాడు.

వృషపర్వుడు స్థిమితపడ్డాడు. యయాతినీ, శర్మిష్ఠనూ, పూరుడినీ ఆశీర్వదించి వృషపర్వుడు కూడా వెళ్ళిపోయాడు. ఇంద్రాణి సమక్షంలో అతడు ఎక్కువసేపు వుండలేక పోతున్నాడు.

"మళ్ళీ యుద్ధం మొదలవుతుందన్న మాట!" అన్నాడు యయాతి.

"ఇది అంతే! ఇంద్ర పదవిలోకి వచ్చే వరకూ తహతహలాడుతారు. ఇంద్రసింహాసనం ఎక్కగానే, ఎక్కడలేని అధికార దాహమూ కళ్ళను కప్పేస్తుంది. కన్నూ మిన్నూ కానని అహంకారంతో పదవి కోసం, పదవి నిలుపుకోవటం కోసం, కొన్ని పనులూ, పదవి ఉందనే అహంకారంతో మరికొన్ని పనులూ, చేయరాని పనులన్నీ చేస్తారు. స్వార్థంతో లోకాలను రక్షించటానికి బదులు, లోకాలని కబళించాలనిచూస్తారు. అక్కడితో మళ్ళీ ప్రజల తిరుగుబాటూ, యుద్ధాలూ మొదలవుతాయి. కల్ప వృక్షాలతో, అప్సరలతో, కుబేరులతో, స్వర్గం భోగ భూమిగా ఉన్నంతవరకూ ఈ చరిత్ర ఇంతే! విశ్వకల్యాణం నిజంగాకోరేవారు మొదట భోగభూమిని నాశనంచెయ్యాలి–అది నాశనం కానంతవరకూ "ఇంద్రసింహాసనం" మీద ఎవరున్నా అంతే! అజ్ఞాత వాసంలో వున్న ఇంద్రుణ్ణి వెతికిస్తున్నారు దేవతలంతా! నహుషుడు దిగిపోయాడని తెలుసుకుని అతడు వస్తాడు– ఇంద్రసింహాసనం ఎక్కుతాడు–అంతే!అతడి పశ్చాత్తాపం మాయమయిపోతుంది. అహంకారం శ్రుతి మించుతుంది. అప్పుడు మళ్ళా లోకాలన్నీ మరో ఇంద్రుడికోసం వెతుక్కోవాలి!

భారత వీరకుమారులారా! భోగభూమిని నాశనం చెయ్యండి! కుబేరులను సామాన్యులను చెయ్యండి! అప్పటివరకూ మనకు మోక్షం లేదు!!"

అందరినీ ప్రబోధించి, స్వర్గానికి వెళ్ళిపోయింది ఇంద్రాణి.

(అయిపోయింది)

పేలగా వున్న కుడిమోకాలుపై చేయి బరువంతా వేసి నేలకు కాస్త పైగా గాలిలో వేలాడుతున్న ఎడమపాదాన్ని ఒకవిధమైన విసురుతో ముందుకు లాక్కుంటూ...నడుం సగానికి పైగా వంగిపోతుంటే ... క్రింది పెదవిని రక్తం వచ్చేలా కొరికిపడ్తూ నడుస్తున్నాడతడు.

"ఇలాంటి సెటప్‌ను యిప్పటిదాకా ఏ 'జూ'లోనూ చూళ్లేదు ... ప్రామిస్..." ఆ మాటలతో పాటు సముద్రపు ఘోషలాంటి నవ్వులు హోరెత్తిపోయినయి.

ఆగలేదతను.. భుజానికున్న సంచీ వెనక్కూ...ముందుకూ అదోవిధంగా వేలాడుతుంటే...అలాగే నడుస్తున్నాడు.

"ఆ మధ్య ఏదో పిక్చరులో ... జంతువు వేషంలోని మనిషి యిలాగే..."

"ఎగ్జాక్ట్లీ..."

కారు మేఘాలు కురిపించే కుంభవృష్టిలా కురిసిన నవ్వులు ఎత్తుగా వున్న ఆ కారిడార్ కప్పుకు గుద్దుకుని ... మరింతగా ప్రతిధ్వనించినయి.

సృష్టిలో అన్నిటికన్నా అందమైనది నాభిలోంచి పుటికివచ్చే నవ్వంటారు సృష్టికి ప్రతిసృష్టి చేయగల సమ్మాన్య స్త్రీ ... ఆ స్త్రీమూర్తి నిండు గుండెల్లోంచి ఒలికిపడే నవ్వు...ఈ లోకంలోని దుఃఖాన్నంతా తుడిచి వేయగలదంటారు...మరిదేమిటి? వారెందుకు నవ్వేది! ఆ నవ్వులో పురుషులే కాదు, చిగురాకులవంటి యువతులు కూడా హృదయపూర్వకంగా పాలు పంచుకుంటున్నారు ... ఎందుకని ... ఇలా పుట్టడంలో నా బాధ్యత ఎంతవరకని ... బోధపడలేదతనికి ... బుద్ధి తెలిసినప్పటి నుండీ అనుక్షణం కాల్చివేసే ఆ ప్రశ్నకు జవాబు ఆలోచించే శక్తి కూడా లేకపోయిందప్పుడు.

"మన క్యాంపస్ కి ఇన్నాళ్ళకొక రేర్ స్పెసిమన్..." తీయని గొంతులోంచి ... ఆ మాటలు విషపు చుక్కల్లా రాలినాయి.

వంకరగా ... బలహీనంగా పడుతున్న అతని అడుగులు చితిమంటల్లా వీపుపై పాకే ఆ మాటల సెగలకు తట్టుకోలేక తడబడినయి. అసలే అద్దంలా మెరిసిపోతున్న ఆ చలవరాతి నేలపై ఏమాత్రం పటుత్వంలేని



కుడిపాదం పట్టుతప్పింది ... మోకాలుపై ఆసరగా పెట్టుకున్న చేయి క్రిందికి జారడంతో బోర్లాపడబోయి అరచేతులు నేలపై ఆనిస్తూ బరువుగా కూలబడిపోయాడు.

"ఓగ్గాడ్..." అది ఆక్రందనో...హర్షాతిరేకమో మరి ... కీచుమంది తీగలాంటి కంఠమొకటి. పక పక మని పదిగొంతుకలు ఒక్కసారిగా ఎగిరిపడడంతో...ఆ బరువుకు గుండెలు చితికిపోయినయి. 'వున్నత విద్య నభ్యసిస్తున్న మేధావుల్లారా...దయచేసి నవ్వకండి ... ఇలా పుట్టడం...ఈ అవిటితనం నా తప్పుకాదు... ఎవరో ఎక్కడినుండో విసిరిన శాపమిది ... ప్లీజ్ నవ్వకండి...' శరీరంలోని ప్రతికణమూ ఆవేదనగా ఆక్రోశిస్తుంటే...కన్నీటి చుక్కలు రెండు అతి నెమ్మదిగా క్రిందికి జారినయి.

వాళ్ళు మాత్రం ఆ గుండెల రొదలను వినిపించుకోలేదు ... ఇంకా బిగ్గరగా నవ్వుకుంటూ పక్కనుండి నడిచిపోయారు.

ఆ క్షణం...ఏదో తెలియని భయంతో ఎండుటాకులా వణికిపోయాడతడు... వూపిరికూడా వినిపించకూడదన్నట్టుగా ... గుండెల్ని బిగపట్టాడప్పుడు...

గుంపు దూరమయినాక ... అంతరాంతరాల్లోంచి సుదీర్ఘమైన నిట్టూర్పొకటి వెలువడుతుండగా...లేవాలనుకున్నాడు ... కాని

సాధ్యం కాలేదా క్షణం...నాలుగడుగుల దూరంలో వున్న గోడవేపు జరిగాడు మెల్లగా...

కాస్త వెనగ్గా వున్న స్తంభాన్నానుకుని... అతడి ప్రతి కదలికనూ... కదలికనే కాదు... గుండెల మెలికలనూ విపితంగా... అతి స్పష్టంగా చూస్తున్న శివాని హృదయం గిజ గిజ తన్నుకుంది. ముందుకు కదలాలని, నిలబడేందుకు అతడికి చేయూతనివ్వాలని ఎంతోసేపటి నుండి అనుకుంటున్నా అడుగు మాత్రం ముందుకు వేయలేక పోయింది.

గోడనాసరాగా చేసుకుని లేచిన అతడు చేయి తీయగానే మళ్ళీ పడబోయాడు అప్పుడు మాత్రం అప్రయత్నంగా ఓవరో వెళ్ళిపట్టుగా ఒక్క అంగలో భుజాల కిందుగా చేతులు వేసి ఒడిసి పట్టుకుంది జారిపడిన పుస్తకాలు పాదాల క్రింద నలిగిపోతుంటే.

"థాంక్యూ... థాంక్యూ వెరీమచ్" నన్ని కన్నీటిపొర దృష్టి వలుముకుంటూంటే బలవంతంగా అన్నాడు.

అతడి నిస్సహాయతనూ, కళ్ళల్లో రెపరెపలాడే ఆ బెదురునూ చూస్తున్న గుండెలు ద్రవించిపోతుంటే, అప్పుడు నవ్వింది శివాని. ప్రత్యూష పవనాలకు పులకరించి కళ్ళు తెరిచే చిన్నారి పూవులు స్నిగ్ధంగా, తడితడిగా నవ్వింది. "క్లాసుదాకా సాయంగా రానా..." పెదాలు దాటిన ఆ మాటల్లో ముల్లోకాల్లోని సానుభూతంతా నిండుగా తొంగి చూసింది.

"ఫరవాలేదండీ నడవగలను" అంటూ చిత్రంగా నవ్వాడతను.

"ఏటువేపు..." క్రిందపడ్డ పుస్తకాల నేరుకున్నాక అడిగింది.

# వూపిరి

"ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్... అయామ్ సారీ... నా పేరు కృష్ణ... వంశీకృష్ణ..."

"ప్లీజ్ టు మీట్... అయామ్ శివాని..."

"మరొక్కసారి థాంక్సండీ..." కృతజ్ఞత నిండిన కళ్ళతో చెప్పి వెనుదిరిగిన అతడు వంకరగా... తల నేలకు తాకుతుందేమో నన్నంతగా వంగిపోయి నడుస్తున్న అతడు... ఆ వరండా మలుపు తిరిగేంతదాకా అలాగే చూస్తూ నిలబడిపోయింది శివాని.

* * *

"లేవనెత్తినప్పుడు కృతజ్ఞతలు చెప్పుకుంటూ అతను చూపిన చూపు... అబ్బ... ఈ జన్మ కంతటికీ మర్చిపోలేను బాబాయ్... పోస్టు గ్రాడ్యుయేషను రీసెర్చి చేస్తున్నవాళ్ళు అలా... వెకిలిగా హేళన చేస్తుంటే... నవ్వడం చూస్తుంటే... కోపానికి బదులు... ఈ నరజాతి పైనే అసహ్యమేసింది... ఛ... ఛ... బీస్ట్స్"

"పొరబడుతున్నావమ్మా... చేతనయిన సహాయం చేసుకోవడమే కాని... ఇలా అవమానించడం... హింసించడం ఎంతటి క్రూర మృగాలకైనా చేతకాదు... చూస్తున్నదాన్ని గురించి ఆలోచించగల మనిషే జాలిపడగలడూ... హింసించగలడు. అది మనిషి స్వభావము... ఇక విద్య... మానవత్వమంటావా... ఆ రెండింటికి సంబంధమే లేదు... ఎంత చదువుకున్నా... మరెంత విజ్ఞానాన్నార్జించుకున్నా కొందరిలో మానవత్వముండదు... అలాంటి వారే విద్యకూ... సంస్కారానికీ సంబంధముండదని ఎప్పటికప్పుడు నిరూపిస్తుంటారు. నిర్వచనం మారిపోయి... వెర్రిగా పెరిగిన ఈనాటి నాగరిక ప్రపంచంలో ఈలాంటి సాడిస్టుల సంఖ్యే ఎక్కువమరి..."

"నిజమే... చదువుకూ సంస్కారానికి సంబంధమే లేదు. మరీ చదువులెందుకు బాబాయ్... ఎందుకు... అదేం నేర్పిస్తున్నట్టు ..."

"పిచ్చితల్లీ... పూలను సిగలో ముడుచుకున్న ప్రతివారికీ ఆ పూలవిలువ తెలుస్తుందా? అలంకారంగా పెట్టుకుంటారంతే ... అంత మాత్రాన వాటి పవిత్రత తగ్గిపోతుందంటావా ...చదువూ అంతే...కొందరికది అన్నం పెట్టే అన్నపూర్ణ. మరికొందరికి మిధ్యాగౌరవాన్ని సాధించే కొలబద్ద... కొందరు మాత్రం ఆ అక్షరాల్లోని విజ్ఞానాన్ని ... వేదాంత సారాన్ని నరనరాల్లో నింపుకుంటారు... వాళ్ళేనమ్మా చివరకు మహాత్ములయ్యేది ... మంచి వి ముందుకు నడిపించేది ఆ మహాత్ములే ... ప్రతిదాంట్లోనూ మంచీ చెడూ వుంటాయి ... ఏదికావాలో ఎవరికి వారు మనోగతాన తెలుసుకోవలసిన విషయం..." చెప్పడం ఆపి ...ఆరిపోయిన పైపును తిరిగి వెలిగించుకోవడంలో నిమగ్నుడయ్యాడు రాజశేఖరం.

"ఏమో .. సంకుచిత మనస్తత్వాలతో ...కుచించుకుపోయిన వ్యక్తిత్వాలతో...దారితప్పిన ఈనాటి మనిషి ఎటునేపు పోతున్నాడో ఎంతకూ అంతుపట్టదు... సరే బాబాయ్ .. టైమయింది వెళ్తానిక ఆలస్యమయితే ..మావార్డెనసలే హిడింబి..." అంటూ లేచింది శివాని.

ఆ మాటలకు చిన్నగా నవ్వుతూ తనూ లేచాడు రాజశేఖరం ఆమెను సాగనంపడానికని...

* * *

"నమస్కారమండీ..." నిర్మలంగా నవ్వుతూ చేతులు జోడించి అన్నాడతను.

కాఫీ తీసుకుని వెళ్తున్న శివాని అలాగే నిలబడిపోయింది అతనే... కాని నిన్నటి ఆ చూపులకు...ఈ కళ్ళకూ సంబంధమే లేదు. గాలి అలికిడయినా విపరీతంగా చలించిపోయే ఆ చూపులకూ... ఎంతకాంతితో మెరుస్తున్న వీటికి అసలు పోలికే లేదనిపించింది.

(48 వ పేజీ చూడండి)



## కల్పతరువు-
## మీ భవిష్యత్తుకు రెట్టింపు
## భద్రతనిస్తుంది.

కల్పతరువు పథకంలో మీరు రు. 50/- లు గాని, అంతకు రెట్టింపులలోగాని మీ వీలును బట్టి పొదుపు చేయవచ్చు. ఉదాహరణకు మీరు ఈ పథకంలో 10 సంవత్సరాల కాలానికి రు. 100/- లు పొదుపు చేస్తే, గడువు తీరిన పిదప మీకు రు. 268.55 పైసలు లభిస్తుంది! అలాగే మీరు రు. 10,000/- లు పొదుపు చేస్తే మీకు రు. 26,855/-లు, నిర్ణీత కాలానంతరం లభిస్తాయి! అంటే మీరు దాచిన సొమ్ముకు 2½ వంతులు మీకు లభిస్తోందన్న మాట! ఈ పథకం అద్భుతంగా లేదూ ? ఈ పథకం మీ వంటి దూరదృష్టి గల వారికోసం రూపొందించబడింది. మీ అబ్బాయి ఉన్నత విద్యాభ్యాసానికి గాని, అమ్మాయి వివాహానికి గాని లేదా స్వంత ఇంటి నిర్మాణానికి గాని మీకు ఆకస్మికంగా పెద్ద మొత్తం అవసరం కావచ్చు. అటువంటి సమయంలో కల్పతరువులో పొదుపుచేసిన ధనం రెట్టింపై మీకు ఉపయోగపడుతుంది! ఇతర వివరాలకు మీ దగ్గరి ఆంధ్రా బ్యాంక్ బ్రాంచిని సంప్రదించండి.

## 10 సంవత్సరాలలో మీ పొదుపు ధనాన్ని రెట్టింపు చేస్తుంది

# కల్పతరువు



మీ పురోభివృద్ధికి మాతో చేయి కలపండి



**ఆంధ్రా బ్యాంక్**

(భారత ప్రభుత్వ సంస్థ) కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్, హైదరాబాదు

ACIL/0229/81

## ఆగస్టు 25, 26 తేదీలలో

# బృహస్పతి తోకతో 'శని'ని కొట్టబోతున్నాడు!

అమెరికా ప్రయోగించిన రెండవ వాయేజర్ నౌక, మొదటి వాయేజర్ నౌక పయనించిన మార్గాన కాక వేరేదారిన పయనిస్తూ శనిగ్రహపు చంద్రులను, శనిచుట్టూ ఉన్న వలయాలను అధిగమిస్తున్నది. ఈ యాత్రలో ఈ నౌక బృహస్పతి గ్రహానికి గల పెద్ద అయస్కాంత తోకను కనుగొన్నది బృహస్పతి యీ "అయస్కాంత పరిధి" 8కోట్ల 80లక్షల కిలోమీటర్లదూరం విస్తరించి ఉన్నది.

ఈ గ్రహంచుట్టూ కమ్ముకొని ఉన్న అయస్కాంత క్షేత్రం తాలూకు భాగమే ఈ తోక అని భావిస్తున్నారు సౌరగోళం నుంచి వచ్చే వేడి రేణువులతో కూడిన 'సూర్యవాయువులు' వల్ల బృహస్పతి అయస్కాంతపు తోక ఆ గ్రహాన్ని అంటి పెట్టుకునే ఉంటున్నది

ఇంతకుముందు ప్రయోగించిన వ్యోమనౌకలు పంపిన సమాచారం ద్వారా బృహస్పతి గ్రహం తాలూకు అయస్కాంత క్షేత్రం బ్రహ్మాండమైనదనీ, అది సూర్యునికంటే పెద్దదనీ శాస్త్రజ్ఞులు తెలుసుకొన్నారు. దీనికితోడు, పెద్దతోక ఉండటంతో, ఈ గ్రహం విశ్వంలో ఒక బ్రహ్మాండమైన శక్తిగా ఉంటున్నది

నిజానికి బృహస్పతి, శని ఒకే వరుసలోకి వచ్చినప్పుడు బృహస్పతి తోక శని గ్రహాన్ని అందుకోగలదని శాస్త్రజ్ఞులు ఊహిస్తున్నారు. ఇలాంటి అనుసంధానమే గనుక జరిగితే, అది, రెండవ వాయేజర్ ఆగస్ట 25, 26 తేదీలలో ఈ రెండు గ్రహాల మధ్య పయనించే నాటివరకూ ఉండగలదని వీరు భావిస్తున్నారు. అట్టి అనుసంధాన సమయంలో ఈ రెండు గ్రహాలకు మధ్య దూరం 62కోట్ల 80 లక్షల కిలోమీటర్లు ఉంటుంది. శనిగ్రహపు అయస్కాంత క్షేత్రపు ముఖంమీద బృహస్పతితోక రూడించినప్పుడు సంభవించే విచిత్ర పరిణామాన్ని చూసే అపూర్వ అవకాశం రెండవ వాయేజర్ నౌకకు లభిస్తుంది. ఈ రెండుగ్రహాల అయస్కాంత క్షేత్రాలు ఒకదానినొకటి సంధించినప్పుడు కలిగే ఫలితాలను పరిశీలించగలిగినప్పుడు శాస్త్రజ్ఞులకు కొన్ని ముఖ్యమైన రహస్యాలు తెలుస్తాయి సౌరగోళపు అయస్కాంత రేఖలు భూగోళపు అయస్కాంత క్షేత్రాన్ని సంధించినప్పుడు ఏమి జరుగుతుందో గ్రహించటానికి ఈ రహస్య భేదన తోడ్పడుతుంది. సౌర గోళములో జరిగే ప్రక్రియల ప్రభావం భూగోళపు అయస్కాంత క్షేత్రంపై ఉంటుందని శాస్త్రజ్ఞులకు ఇంతకుముందే తెలుసు ఇందువల్ల భూగోళంపై రేడియో కమ్యూనికేషన్లకు అంతరాయం కలుగుతుంది సౌర ప్రక్రియలు, సుదూర భవిష్యత్తులో భూగోళపు శీతోష్ణ స్థితిగతులలో మార్పు తీసుకరాగల ప్రమాదం ఉన్నదని కొందరు శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు. అయితే, అది ఎలా జరుగుతుందో మాత్రం ఇంతవరకు ఊహాతీతంగానే ఉంటుంది

## అయస్కాంత తోక !

రెండవ వాయేజర్ నౌక చేయవలసిన పనులలో బృహస్పతికి గల తోకను కనుగొనటం ఒకటి ఈ వ్యోమ నౌక శని గ్రహపు 17 చంద్రుల మధ్యగా, దాని సందలాది వలయాలను దూసుకొంటూ పయనిస్తుంది. ఈ చంద్రుల రంగులు ఎప్పటికప్పుడు మారుతుంటాయి ఈ మారుతున్న రంగులను వాయేజర్ – 2 కనిపెట్టవలసి ఉన్నది

వాయేజర్ – 2 శని గ్రహానికి అతి దూరంలో ఉన్న టెతిస్, ఎన్‌సెలడస్, షోబ్, హైపరియన్, అయెపెటస్ అనే చంద్రులకు సమీపంగా పోతుందనుకొంటున్నారు వాయేజర్ – 1 కనుగొన్న శని గ్రహం వలయాలను, మళ్లీపరిశీలించగల పరికరాలను కూడా వాయేజర్ – 2లో అమర్చారు

## శని చందమామలు ఎన్ని ?

వాయేజర్ నౌకలను ప్రయోగించక ముందు శనిగ్రహానికి పది చందమామలు (ఉపగ్రహాలు) మాత్రమే ఉన్నాయని భావించేవారు. వాయేజర్–1 మరి మూడు చందమామలను కనుగొన్నది. భూతల కేంద్రాలద్వారా మరి నాలుగు చంద్రుళ్లను కనుగొనటం జరిగింది వాయేజర్–2మరికొన్ని చందమామలను కనుగొనగలదా ?

అంతేకాదు, వాయేజర్–2 మరికొన్ని శని వలయాలను కనుగొనవచ్చుననుకొంటున్నారు. ఈ వ్యోమనౌక శని, బృహస్పతి గ్రహాలుదాటి 1986 నాటికి వరుణ గ్రహాన్ని చేరుకోగలదనుకొంటున్నారు

(ఖర్మ, క్రిష్ణల్)

వైట్‌హౌస్ పచ్చిక మైదానంలో అమెరికా అధ్యక్షుని సతీమణితో ఆమె కుమారుడు రాన్ రీగన్ (జూనియర్) సైకిలుమీద సరదాగ తిరుగుతున్న దృశ్యం ఈ అబ్బాయి మంచి "బాలే" నృత్యకారుడు




(గత సంచిక తరువాయి)

వెంకట్రావ్‌గారిని భద్రంగా బండి ఎక్కించాడు శ్రీకాంత్. ఆయన వేవిళ్ళు – కోరికలు – బొట్టు కాటుక పెట్టుకుని, చీర కట్టుకున్న విధం- ఒక్కొక్క సంఘటన తలుచుకుని నవ్వుకున్నారు. అది తలుచుకుంటే రమ్యకు ఎప్పుడూ గిలిగింతలు పెట్టినట్లు నవ్వు వస్తుంది. అలా నవ్వుతూ నవ్వుతూ కడుపు పట్టుకుంది. సడన్‌గా వచ్చిన నొప్పి సర్దుకుంటుందని తలచి అలా కూర్చుంది. అలా వచ్చిన నొప్పి ఎక్కువ అవుతోందే కాని తగ్గలేదు. శ్రీకాంత్‌ను చూసింది. రమ్యనే గమనిస్తున్న శ్రీకాంత్ – ఆలస్యం చేయక కావలసిన వస్తువులు బ్యాగ్‌లో పెట్టుకుని రమ్యతో ఆసుపత్రికి వచ్చి చేరుకున్నాడు.

బల్లమీద కూర్చున్న రమ్యను ఎవ్వరూ పట్టించుకోలేదు. చూస్తున్నారు. చూసి, తిరిగి ఎవరి పనిమీద వాళ్ళు పోతున్నారు. బాధను పళ్ల బిగువున అణచుకోవాలని ప్రయత్నిస్తోంది. కళ్ళు తడి అయి బేలగా,వుండి వుండి శ్రీకాంత్‌ను చూస్తోంది. తన భార్య తన ప్రాణం అయిన రమ్యకు ఈ సమయాన తనేమి చేయలేడా? తన అర్ధాంగి బాధను పంచుకోలేడా ? ప్రసవ వేదన ఒక ఆడదే భరించడం న్యాయమా ? దేవుడెందుకు ఇలా చేశాడు ? అనుకుంటూ రమ్య ముఖాన్ని కర్చీఫ్‌తో తుడిచి జేబులో పెట్టుకుని, "ఇప్పుడే వస్తా" అని గబగబా వెళ్ళిపోయాడు.

అలా వెళ్ళిన అయిదు నిముషాలకు డాక్టర్‌ను వెంటబెట్టుకుని వచ్చాడు.

"శ్రీకాంత్! నన్ను డాక్టర్‌గారు అని పిలుస్తావేంటి ? చిన్నప్పుడు 'వసూ' అని పిలిచేవాడివి. చీకటి పడితే మా ఇంటి దాక నిన్ను తోడు ఇచ్చి పంపేది టీచర్. చిన్ననాటి చెలిని పేరుపెట్టి పిలువు" అని అనటం రమ్య విన్నది.

"మీ జ్ఞాపక శక్తికి నా జోహార్లు. అలాగే పిలుస్తాను" అంటున్నాడు శ్రీకాంత్.

రమ్యను పరీక్షించి – కేస్ షీట్ వ్రాసి, వార్డులో చేర్చింది. అన్నీ తనే దగ్గర వుండి, పనులన్నీ జరిపించింది.

"మెనీ, మెనీ, థాంక్స్" అని చెప్పాడు.

"థాంక్స్ అప్పుడేనా! మీ రమ్యకు ఇంకా టైం వుంది. మీరు వెళ్ళి రెస్ట్ తీసుకుని – సాయంకాలం రండి" అని వసుంధర చెప్పింది.

"వెళ్ళిపోతారా ?" అన్నట్లు చూసింది రమ్య.

"డాక్టర్... వసుంధరా! హస్‌బెండ్ దగ్గర వుంటే కాన్పు ఈజీగా, త్వరగా అవుతుందని చెప్పరూ..."

"యు నాటీ బాయ్! నీకు వుండాలని వుంటే మాకేం అభ్యంతరం లేదు. కాని, వార్డులో ఇంకా వేరే ఆడవాళ్ళు వుంటారు. వారికి అభ్యంతరం వుండవచ్చు.

అయితే నాతో రండి – నా కారియర్ వచ్చి వుంటుంది. భోజనం చేసి వచ్చి మనిద్దరం రమ్య దగ్గర వుందాం."

"ఓ...కే" అంటూ శ్రీకాంత్ ఒప్పేసుకున్నాడు. ఇప్పుడు వసుంధర అవసరం ఎంతైనా వుంది. ఆమె చెప్పినట్లు చేయడమే తన పని. వసుంధర దగ్గర వుంటే తనకు కొండంత ధైర్యంగ వుంది. యే దిక్కూ లేని వాళ్ళకు వసుంధర దిక్కయ్యింది.

రమ్యకు కాన్పు కష్టమైంది. సిజేరియన్ ఆపరేషన్ చేయవలసి వచ్చింది. రమ్య భయపడలేదు. ధైర్యంగనే వుంది. ఈ నొప్పులు భరించేకంటే ఆపరేషన్ చేయించుకోవటమే మేలనుకుంది. ఆపరేషన్‌కు తయారుచేసి ట్రాలీపై థియేటర్‌లోకి తీసుకువెళ్తుంటే థియేటర్‌దాకా – రమ్య చెయ్యి పట్టుకుని వచ్చాడు. గట్టిగా చెయ్యి పట్టుకున్న తీరు చూసి – కాంతి ఎంత బాధపడుతున్నాడో – ధైర్యంగ వుండటానికి ప్రయత్నిస్తున్నాడో గ్రహించింది.

ఇదే చివరిసారి కాదు కదా! శ్రీకాంత్‌ను చూసింది. అతని కళ్ళు ఎర్రగా వున్నాయి – రాత్రి అంతా మేల్కొనేవున్నాడు, నలిగిపోయివున్నాడు. తన కాంతిని వదలి తను ఎక్కడికి పోదు... చిరునవ్వుతో చూసింది. ఆ నవ్వు శ్రీకాంత్‌ను కదిలించివేయగా– చటుక్కున వంగి ముద్దు పెట్టుకున్నాడు. ఎంతో మంది చూశారు. కాని ఇలా అపురూపమైన జంటను చూడటం ఇది మొదటిసారి అక్కడి పని వాళ్లకి. సిస్టర్స్ సిగ్గుపడిపోయి ముఖాలు తిప్పుకున్నారు. ఆయాలు ఆనందంగా నవ్వారు. వసుంధర దీర్ఘంగ శ్రీకాంత్‌ను చూసింది. అప్పుడే ఆ క్షణంలో తనలో ఏదో రగులుకున్నట్లయ్యింది. ఆమె కళ్ళు తళుక్కుమన్నాయి. రమ్య చేతులు జోడించి నమస్కరించింది దేవుడికి కాదు తన శ్రీకాంత్‌కు. ఆ రెండు చేతులు పట్టుకుని "రమ్యా! డార్లింగ్ వైఫ్! నీకేమైనా అయితే నేను బ్రతుకను, అది గుర్తుంచుకో – నాకోసం నీవు తప్పకుండా క్షేమంగా వస్తావు. ఇంత కష్టం అని తెలిస్తే... నాకు ఆ పిల్లలే అవసరంలేదు..." వంగి భార్యతో గుసగుస లాడుతున్న శ్రీకాంత్ భుజంపై చెయ్యి వేసింది వసుంధర.

"మామూలుగ కనేకంటే – ఆపరేషన్ చేయించుకోవటంలోనే ఎన్నో సుఖాలున్నాయి. వంటి బిగువు తగ్గదు. ఎప్పుడూ కొత్త పెళ్లికూతురులాగ వుంటావు..." అంటూ సిస్టర్ హాస్యమాడుతూ ఇంజక్షన్ చేసింది మత్తుగా కళ్ళు మూసుకున్న రమ్యకు శ్రీకాంతే కనిపిస్తున్నాడు.

మత్తుమందు ఇచ్చారు. ముక్కు దగ్గర పెట్టిన మాస్క్ డాక్టరమ్మ సరిగ్గా పెట్టలేదు. ఒక ప్రక్కగా పెట్టటంతో ముక్కు వత్తుకుపోతూంది. సరిగ్గా సరిచేసుకుందామని చెయ్యి ఎత్తింది. ఆ చేయి గట్టిగా వత్తి పట్టుకుంది ఆయా. మాస్క్ లాగేసుకోవటానికి కాదు. సరిగ్గా ముక్కుపైన పెట్టే వత్తుతున్నారు. ఆ మాటే చెప్పాలన్నట్లు తల ఆడించింది. ఆ డాక్టరమ్మ ఎవరోగాని అర్థం చేసుకోలేదు.

'కదలకు' అని తల పట్టుకుంది.

మాస్క్ ఎక్కడ పెట్టుతున్నాం – సరిగ్గా అమరిందా లేదా ? అని చూసుకోవాలి కదా ? అసలు బాధకంటె ఇలాటి బాధలే ఎక్కువ వుంటాయి పేషంట్లకు.

ఆపరేషన్ చేస్తున్న పెద్ద డాక్టరమ్మ మృదువుగా మాట్లాడుతోంది. మత్తుమందు ఇస్తున్నా వారి మాటలన్నీ తాను వింటూనే వుంది. వసుంధర ఆమెకు అసిస్ట్ చేస్తూంది కాబోలు - రమ్యను గురించిన వివరాలు చెప్పతూంది. ఆ తర్వాత శరీరం తేలికైపోయింది. ప్రాణం పైకి పోతున్న ఫీలింగ్ తమాషాగా వుంది. పూర్తిగ మైకం వచ్చింది. అదెంతోసేపు వుండలేదు. చకచకమని ఆపరేషన్ జరిగిపోతూంది. వారిలో వారు మాట్లాడుకుంటూ – ఆపరేషన్‌లో నిమగ్నమైపోయారు. 'బేబీ'ని తీశారు. మేల్ బేబి అని అనుకోవటం వినింది. ఆ తరువాత మరేమి గుర్తు లేదు. చుట్టూ కటిక చీకటి – ఆ చీకటిలో కొట్టుకుపోతూంది. ఏమిటి! ఈ లోకం అంతమైపోయిందా ? సూర్యచంద్రులు రాలిపోయారా ? – అన్న భావం స్ఫురించింది. అంతలో 'అమ్మా' అని

**జరిగిన కథ–4 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్ళు, ఒక్క కొడుకు విమ్మ. పెద్ద కూతుళ్లిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు. వాళ్ళొకరోజు లేచిపోయి గుళ్ళో పెళ్ళి చేసుకొని, కొత్త జీవితం ప్రారంభిస్తారు. ఇంటి యజమాని వెంకట్రావ్ భార్య సుగుణ రమ్యను తన సొంత చెల్లెలుగా చూసుకొంటుంటుంది రమ్యకు గర్భం వస్తుంది. ఈ వార్త పిల్లలు పుట్టని సుగుణకు బాధ కలిగిస్తుంది. కానీ ఆమె కూడా గర్భవతి అవుతుంది. వెంకట్రావ్‌కు కూతురు పుడుతుంది. శ్రీకాంత్ చిన్ననాటి స్నేహితురాలు డా॥ వసుంధర అతనితో అంత క్లోజ్‌గా ఉండడం సహించలేకపోతుంది రమ్య.

తనలోని ప్రాణం కేకేసింది. ఆ కేక నోటిలోనుంచి రాలేకపోయింది. ప్రాణం ఆ నొప్పికి గిలగిల లాడింది. అబ్బా! ఏమిటీ ఆ నొప్పి — సూదితో బలంగా పొడుస్తున్నారు. తన ప్రాణం ముక్కలౌతోంది. మత్తు ఇస్తే నొప్పి తెలియదంటారు. ప్రసవవేదన యింత భయంకరమా! అప్పుడు గునపంతో నడుంపై బలంగ పొడిచినట్లుండేది. ఈ నొప్పి అనుభవించినవాళ్లకే తెలుస్తుంది కాని మాటల్లో వర్ణించలేము. శ్రీకాంత్‌కి చెప్పలేను — తర్వాత ఏమి గుర్తులేదు.

రమ్యను — రమ్య ప్రక్క బాబును చూసిన తర్వాతగాని శ్రీకాంత్ మనస్సు నెమ్మదిగా — కుంభవృష్టి కురిపించి తెరిపివిచ్చిన ఆకాశంలా — ప్రశాంతంగా వుంది.

మెడపైన స్టెత్, కోటు జేబులో చేతులు పెట్టుకుని, రమ్యను పరామర్శించటానికి వచ్చిన వసుంధరతో—

"మీ రుణం తీర్చుకోలేనిది, వసుంధరా" అన్నాడు వసుంధర చిరునవ్వు నవ్వింది.

శ్రీకాంత్‌కు చిన్న కష్టం కలిగించక, రమ్య బాధ్యత, వసుంధర తీసుకుంది. అన్ని పనులు స్వయంగ చేసేది. సుగుణక్కను మరిపించినా — వసుంధరను, ఆమె స్నేహాన్ని ఎందుకో స్వీకరించలేక పోయింది. సుగుణక్కను అభిమానించినట్లు వసుంధరను అభిమానించలేకపోయింది. అంటనట్లు వుండేది.

రమ్యకు కుట్లు విప్పిన మరు రోజు — తమ కారులో ఇంటికి చేర్చింది వసుంధర. రెండు రోజులకు ఒకసారి అయినా వచ్చేది. బాబును ముద్దు చేసేది. ఎత్తుకునేది.

"చక్కని కళ్లు — అంతా నీపోలికే శ్రీకాంత్" అంటూ ముద్దు పెట్టుకునేది.

ఒక రోజు — వసుంధర వచ్చే సమయానికి బాబును ఎత్తుకుని వున్న శ్రీకాంత్ "వసుంధర నీకోసం ఎంతో కష్టపడిందిరా — నీ పేరు సుందర్" అంటూ బాబును వసుంధరకు అందించాడు.

వసుంధర ముఖం సంతోషంతో విప్పారింది. రమ్య వారితో సంభాషణలో పాల్గొనక మౌనంగ వుండిపోయింది.

బాబుకు పాలు పట్టడం, స్నానం చేయించటం, ఆ పనులన్ని నేర్చుకుని — తనే స్వయంగ చేసేది. బాబు ఆలన పాలనలో పూర్తిగా మునిగిపోయింది.

మూడు నెలలు ఇట్టే గడిచిపోయాయి. సుగుణక్క ఇంకా పుట్టింటి నుంచి రాలేదు. ఇదో నెలలో వస్తుందని వెంకట్రావ్ చెప్పాడు. వారానికి ఒకసారి వెళ్లి వస్తుండేవాడు.

"రమ్యా బాగున్నావా? పాపకు 'రమ్యా' అని పేరు పెట్టాను. రమా! రమా! అని ఇక్కడ అంతా పిలుస్తున్నారు. నిన్ను, బాబును చూడాలని వుంది. చిన్నదానివి. ఏం కష్టపడుతున్నావో — నాకు రావాలనే వుంది — కాని వళ్లంతా పచ్చిపుండుగా వుంది, రెండు కుట్లు పడ్డాయి. అవి ఇంకా పూర్తిగా మానలేదు — బాధిస్తూనే వున్నాయి. వచ్చినా ఇంటి పనులకంటే మీ బావగార్కి సేవ చేయలేను. మీ బావ మంచివారు కాదు. అందుకే భయపడి రావటల్లేదు..." అంటూ పొడుగాటి ఉత్తరం వ్రాసింది. అంతా తను మాట్లాడుతున్నట్లే వ్రాసింది. బాబుకు, తనకు గుడ్డలు, పౌడరు పంపింది.

రమ్య సుగుణక్క ఉత్తరాన్ని ముందు పెట్టుకుని కూర్చుంది. తనకూ తనవాళ్ల దగ్గరకు వెళ్లాలనివుంది. బాబును అమ్మకు, నాన్నకు చూపాలని వుంది. వాళ్లంతా బాబును ముద్దు చేస్తుంటే చూడాలనివుంది. అక్కలకు ఏవి తక్కువో చూపాలని, వారికి పెండ్లి చేయమని అమ్మకు చెప్పాలనివుంది. శారీరకంగా కాదు మానసికంగా కూడ తాను ఎదిగినట్లనిపించింది తను ఈ వూరికి వచ్చిన కొత్తలో - విమ్మ ఇల్లు వెతుక్కుంటూ వచ్చాడు. వాడిని చూడగానే



సంతోషంతో కేక వేసింది. వాడు తనవైపు చూడటంలేదు. ఇల్లంతా కలియచూస్తున్నాడు.

"ఏమిటి వెతుకుతున్నావ్" అంది

"వాడేడి ?" అన్నాడు.

"వాడా !... శ్రీకాంతా ?" ఆశ్చర్యంగా అడిగింది, శ్రీకాంత్‌ను అలా సంబోధించినందుకు

"కాదే, బాబు."

అప్పుడు గుర్తుకు వచ్చింది ఈపాటికి తనకు బిడ్డ పుట్టి వుంటాడని లెక్క వేసుకుని వచ్చాడని కిలకిలా నవ్వింది.

"ఛీ! నీవేమీ మారలేదు అలాగే నవ్వుతున్నావ్..."

"లేకపోతే ఏమిటి ?"

"అలా ఎందుకు చెప్పావ్ ?"

"నీవు వూహించుకున్నావు వానికి నే బాధ్యురాలవా ?" అని వాడి అంకలిర్చి ఇంటివారి యోగక్షేమాలు అడిగింది.

"అందరూ బాగున్నారు. అమ్మ ఏడ్చింది ఇప్పుడు నిన్ను అందరూ మరచిపోయారు" అంటూ వుడికించి, వెళ్ళాడు. మళ్ళీ రాలేదు. వెళితే ఏమంటారో అని ఆలోచిస్తున్న సమయంలో ఇంటి ముందు కారువచ్చి ఆగింది. అందులోనుంచి శ్రీకాంత్ దిగాడు. తలుపు దగ్గర వంగి లోనికి చూస్తూ వసుంధరను దిగమని బ్రతిమాలుతున్నట్టు అడుగుతున్నాడు.

"రేపు వస్తాను– బాయ్ !" అని తీయగా నవ్వటం రమ్య చూసింది. కారు వెళ్ళేదాకా అక్కడ వుండి తర్వాత హుషారుగ ఈల వేసుకుంటూ లోనికి వచ్చాడు.

"సుందర్ . . నీవు అదృష్టవంతుడువిరా .. అరే–రమ్యా ! వీడు గుడ్డలు తడిపేశాడు" అంటూ రమ్యను పిలిచాడు. శ్రీకాంత్ పిలుస్తూన్నా రమ్య కదలకుండా కిటికీ దగ్గరే నిలుచుంది. శూన్యంలోకి చూస్తూ నిలుచున్న రమ్య దగ్గరకు ఆత్రంగా వెళ్ళాడు. భుజాలు పట్టి తనవైపుకు తిప్పుకున్నాడు రమ్య ముఖం పాలిపోయివుంది. కళ్ళు దిగులుగా, కళావిహీనంగా తనవైపే చూస్తున్నాయి.

"రమ్యా ?"

రమ్య తనకు కలిగిన దుఃఖాన్ని ఆపుకునే ప్రయత్నంలో అధరాలు వణుకుతున్నాయి.

"రమ్యా! అలా వున్నావేం ? వంట్లో బాగులేదా ?!" నుదురు, చెంపలు తాకి చూశాడు.

శ్రీకాంత్ స్పర్శతో కన్నీరు వుబికి వచ్చింది

"ఎందుకు ఏడుస్తున్నావ్ ?" ఆత్రంగ అడిగాడు.

"వసుంధరను పిలుచుకురానా ?"

ఇక ఆపుకోలేక పెద్దగా ఏడ్చేసింది. తన దుఃఖానికి కారణం చెప్పలేకపోయింది.

ఇదివరకులాగ – తనకేం తోస్తే అది చెప్పలేకపోతూంది. నీవు వసుంధరను చూసి తియ్యగా నవ్వావు – వసుంధర నీ కళ్ళల్లోకి చూసింది– అని చెప్పలేకపోయింది.

నీవు ఆమెవైపు చూడకూడదు– అని శాసించలేకపోయింది.

కాని – కారణం చెప్పకపోతే శ్రీకాంత్ వూరుకునేలా లేడు.

"మీరు ... మీరు నాకు దూరం అయిపోయినట్లనిపిస్తూంది ... " వెక్కిళ్ళ మధ్య అంది.

శ్రీకాంత్‌కి అప్పుడు తెలిసి వచ్చింది వసుంధరతో మాట్లాడటం రమ్యకు ఇష్టం లేదని కాసేపు మౌనంగా వుండిపోయాడు. బరువుగ నిట్టూర్చాడు.

"రమ్యా! ఇంతేనా నీవు నన్ను అర్థం చేసుకుంది."

రమ్యవైపు చూశాడు. ఈ రమ్యే తన కోసం తనవాళ్ళను, చదువును వదులుకుని రాత్రికి రాత్రి వచ్చేసింది, అనుకుంటే గుండె తమాషాగా కొట్టుకున్నట్లయ్యింది. రమ్యను సందిట్లోకి చేర్చుకుని -

"రమ్యా! నీవు పిచ్చిదానివి ... వసుంధర మంచి డాక్టర్, స్నేహశీలి. చిన్నప్పటి అభిమానంతో



మనల్ని ఆదుకుంది. నీవు నొప్పులతో అరుస్తుంటే దిక్కుతోచక దిగాలుపడి వున్న నాకు ఎంతో ధైర్యాన్ని యిస్తూ — మనల్ని కష్టంలోనించి గట్టెక్కించింది. ఆమె వలననే, ఆమె పలుకుబడి వలననే కదా మనకి ఆస్పత్రిలో అన్ని సౌకర్యాలు అమరాయి. ఆమె లేకపోతే మన ముఖాలు ఎవరు చూసేవారు. పైగా మన తాహతుకు మించిన ఖర్చు అయ్యింది. తేలిగ్గా బయటపడ్డాం.

రమ్యా! స్నేహంలో తప్పులేదు. మనకే ఎన్నో లాభాలు వున్నాయి. ఆమె నాన్నగారు మా బాస్. అందుకే నాకు మేనేజర్‌గా ప్రమోషన్ యిచ్చారు. ఈ రోజునుంచి జీతం ఎక్కువైంది. ఆ సంతోషంతో నీ దగ్గరకు వచ్చాను.

రమ్యా! నా గుండె చీల్చి చూపే శక్తి నాకు వుంటే చీల్చి చూపేవాడిని. అందులో నా కోసం ఇంటినుంచి పారిపోయి వచ్చిన నా చిన్నారి రమ్యను చూపేవాడిని" అంటూ రమ్యను చుట్టుకుపోయాడు.

"రమ్యా! నా ప్రాణం! నీకు దూరంగా ఎందుకు వుంటున్నానో తెలుసా? ఆరు నెలల వరకు భార్యకు దూరంగా వుండాలని డాక్టర్ సలహా. అందుకే నీకు దూరంగా వుంటున్నాను. నీకు దూరమైనట్లు అనిపిస్తుంది ..." రమ్యలో లీనమైపోయాడు. శరీరం పచ్చిగా, బలహీనంగా వున్నా బాధను ఓర్చుకుంటూ భర్త కౌగిల్లో ఒదిగిపోయింది.

రమ్యకు ఇష్టంలేని పని తను చేయలేదు. ఆ రోజునుంచి వసుంధరతో చనువుగా వుండటం లేదు. ఆ యింటికి రాకపోకలు తగ్గించేశాడు. వసుంధర వెతుక్కుంటూ ఆఫీసుకు వెళ్ళేది.

"ఆఫీసు పనిలో తీరికలేదు. అందుకే రాలేకపోయాను" అంటూ ఏవో సాకులు, సంజాయిషీలు చెప్పేవాడు.

వసుంధర రమ్మని మరీ బలవంతం చేస్తే రమ్యను తీసుకుని వెళ్ళేవాడు. కాసేపు కబుర్లతో కాలక్షేపం చేసి వచ్చేవాడు.

ఒకరాత్రి రమ్యకు అప్రయత్నంగా మెలకువ వచ్చింది. ప్రక్కలో వున్న సుందర్, బరువుగా శ్వాస పీలుస్తున్నాడు. ఆయాస పడుతున్నాడు. బాధగా మూలుగుతున్నాడు. రమ్య ఏడుస్తూ శ్రీకాంత్‌ను లేపింది. అర్ధరాత్రి సుందర్‌ను తీసుకుని ఆస్పత్రికి వెళ్ళారు.

నిద్రలో విసుక్కుంటూ వచ్చిన డాక్టర్ ఏదో ఇంజక్షన్ చేసి వెళ్ళాడు. అయినా సుందర్ చేతుల్లో నిలువటం లేదు. కళ్ళు తేలేస్తున్నాడు.

రమ్యకు భయంగా, బెంగగా వుంది. "కాంతీ! వసుంధరను పిలుచుకు రండి."

"ఇంత రాత్రిలోనా? ఆమె డ్యూటీ కాదు. వస్తుందా? రాకూడదేమో?!...రేపు చూపిద్దాం."

రేపు అనేది వస్తుందా? అనుకుంది. బాబు పడుతున్న బాధను ఆ తల్లి చూడలేకపోయింది. "వెళ్ళండి. వసుంధరను పిలుచుకు రండి. మీరు పిలిస్తే తప్పక వస్తుంది ..." ఏడ్చేసింది.

శ్రీకాంత్ పరుగున వెళ్ళాడు. వసుంధరను పిలుచుకు వచ్చాడు. త్వరగా వచ్చారు వసుంధర కారులో. వసుంధర వస్తూనే బాబును చూసింది. చిల్డ్రన్స్ స్పెషలిస్ట్‌కు ఫోన్ చేసింది. కారు పంపి పిలిపించింది. ఆ డాక్టరు వస్తూనే — ఇంటెన్సివ్ కేర్ రూంలోకి మార్పించారు. ఏవో ఇంజక్షన్లు ఇచ్చాడు. కొత్త మందులు, ఇంజక్షన్ వ్రాసి ఇచ్చాడు. అప్పటికప్పుడే మెడికల్ షాపు తెరిపించి మందులు తెప్పించి వేసింది. ఆక్సిజన్ టెంటులో వుంచింది.

సుందర్‌కి ఆయాసం తగ్గింది. నెమ్మదిగా నిద్రపోయాడు. ప్రొద్దుటే సుందర్‌కి ఎక్స్‌రే తీయించారు. పీడియాట్రిషన్ తను అనుకున్నదే అన్నట్లుగా తలూపాడు.

సుందర్‌కి హార్ట్ ట్రబుల్ వుందని చెప్పాడు.

రమ్య మూర్ఛపోయింది. రమ్య ఆ మాటకే తట్టుకోలేకపోయింది. అంటే, ఆమెకు నరాల బలహీనత వుంది. జాలిగా శ్రీకాంత్ వైపు చూసింది వసుంధర.



"జబ్బులకు భయపడే కాలం కాదు ఇది. ప్రతిదానికి మందులు వున్నాయి. నీ కొడుక్కి వచ్చిన భయంలేదు" అని ధైర్యం చెప్పింది వసుంధర.

తనే వారిని వెల్లూరు హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళింది. 'నా దత్తపుత్రుడు' అంటూ డాక్టరుకు చెప్పింది. అన్ని పరీక్షలు క్షుణ్ణంగా చేయించింది. పెద్ద పెద్ద డాక్టరులు, స్పెషలిస్టులు చూశారు.

"ఓ చిన్న ఆపరేషన్ చేస్తే సరిపోతుంది. ఇప్పుడు కాదు. చైల్డ్‌కి మూడు, నాలుగు సంవత్సరాలైనా రావాలి" అని చెప్పి, తీసుకోవలసిన జాగ్రత్తలు — ఇవ్వవలసిన మందులు అన్నీ డాక్టర్ వసుంధరకు చెప్పారు.

అంతా పెద్ద డాక్టర్లు చూశారు, సుందర్‌కి సగం జబ్బు నయమైపోయినట్లే అని రమ్య తలచింది.

* * *

రమ్య ఇదివరకు వసుంధర సామీప్యము సహించేదికాదు. వారానికి ఒకసారి వచ్చినా 'ఈమెకి పనేమిలేదా?' అని విసుక్కునేది వసుంధర ఇంట్లో వున్నంతసేపు శ్రీకాంత్‌ను ఒంటరిగా వదలి వెళ్ళేది కాదు. అటువంటి రమ్య, ఇప్పుడు రోజూ రావాలి అని కోరుకుంటుంది. పైగా వసుంధరకు తోడుగా శ్రీకాంత్‌ను వెళ్ళమంటూంది.

"వెళ్ళండి. ఆమె ఒంటరిగా ఎలా వెళ్ళ్తుంది?" అని కోపం చేసుకునేది.

వసుంధర ఆ యింట్లో ఒకరుగా కలిసిపోయింది, అనే కంటే రమ్య కలుపుకుంది అనవచ్చు.

సుందర్ జబ్బు లక్షణాలు పూర్తిగా తగ్గిపోయాయనే చెప్పవచ్చు. కాని ఛాతిమీద వాపు అప్పుడప్పుడు కనిపిస్తూనే వుంది.

వసుంధర ఇంట్లో వున్నంతసేపు బాబును ఆమెకు ఇచ్చేది. "మీ సుందర్‌ను బాగా పరీక్షించండి" అని చెప్పేది. జరగబోయే ఆపరేషన్ గురించి వివరాలు అడిగేది. "ఆపరేషన్ అయిపోతే ఇక ప్రాణాపాయం వుండదుగా వసుంధరా" అని పదే పదే అడిగి తెలుసుకునేది.

వసుంధర స్వంత నర్సింగ్‌హోమ్ పెట్టే ప్రయత్నంలో వుంది. "డబ్బు వుంది. తెలివితేటలు వున్నాయి. ఇక ఆగటం దేనికి?" అని శ్రేయోభిలాషులు అన్నారు.

తను స్వయంగా చూసుకోవలసిన పనులు శ్రీకాంత్‌కు వప్పచెప్పేది. కావలసిన సామానులు ఇన్‌స్ట్రుమెంట్సు తీసుకురాను పలుమార్లు బొంబాయి, మద్రాసు లాంటి పట్టణాలకు పోవలసి వచ్చేది. ఆ పనులన్నీ శ్రీకాంత్‌కు పురమాయించేది. తన పనులు శ్రీకాంత్ చేస్తుంటే అదోరకం తృప్తిగా, ఆనందంగా వుండేది. తన బరువు బాధ్యతలు — భవిష్యత్తు అంతా శ్రీకాంత్ చేతుల్లో వుంచి నిశ్చింతంగా వుండాలనిపించేది. తన పనుల మీద శ్రీకాంత్ వెళ్ళినప్పుడు, వసుంధర వచ్చి రమ్యకు తోడుగా పడుకునేది. ఆ ఇంట్లోనే గడిపేది. శ్రీకాంత్ లేకపోయినా - శ్రీకాంత్ ఇంట్లో తను వుంటే అదొక ఆనందం. ఇంత అల్ప సంతోషి తను! అనుకునేది.

రమ్య, సుందర్‌లు శ్రీకాంత్‌కు ప్రియమైన వాళ్ళు. అందుకే వారు తనకు ఇష్టమైనవారు.

ఏమిటీ ... ఈ అనుబంధం? ఇది ఎంత దూరం పోతుంది? ఎలా ముగుస్తుంది? అన్న ఆలోచనల్లో నిద్రపట్టని రాత్రులెన్నో గడిచిపోయాయి.

రమ్య తనను కాదనలేదు. తన అవసరం ఆమెకెంతో వుంది. తనను స్వీకరించినట్లే ఇంట్లో చేర్చుకుంది రమ్య. ఈ ప్రక్క లైన్ క్లియర్ ... ఇక శ్రీకాంత్‌ను ఆకర్షించుకోవడమే మిగిలివుంది. ఎలా శ్రీకాంత్‌ను తన వాడిగా చేసుకోవాలన్న ప్రయత్నంలో వుంది వసుంధర.

(ఇంకా వుంది)

# ఐఓబి క్యాష్ సర్టిఫికేట్లు పెరుగుతున్న మీ బాధ్యతల గుర్తులు

కొందరు వ్యక్తులతో మీ సంబంధ బాంధవ్యాలు తరగనివి. మీ తల్లితండ్రులు, భార్యా పిల్లలూ, మనమలూ వీరివల్ల మీ బాధ్యతలు కాలంతోపాటు పెరుగుతాయి.

ఐఓబి వారి క్యాష్ సర్టిఫికేట్లు - మీ ఆత్మీయుల పట్ల మీ బాధ్యతలు శ్రద్ధగా నిర్వహిస్తున్నారన్నదానికి నిదర్శనమే. మీరు కొద్దిగా పెట్టే మదుపు రాగల రోజులలో భారమనిపించే ఖర్చుని భరించే శక్తినిస్తుందినాడు. కాలం గడవను యిది మూడింతలు పెరుగుతుంది. అవసరమయేనాటికి వీటిని రొక్కంగా మార్చుకోవచ్చును.

ఐఓబి క్యాష్ సర్టిఫికేట్ యీ రోజున రూ. 372/- కి కొంటే పదేళ్లలో రూ. 1000/- కి పెరుగుతుంది. మీరేం మళ్లీ యివ్వనక్కరలేదుకూడా. మీకు కావలిస్తే అతితక్కువ రూ. 37.20కి కొనవచ్చును. లేదా అత్యధికం రూ. 92,800 కి కొనవచ్చును. పదేళ్ళకి రొక్కంగా మార్చుకోవచ్చును. లేదా ఒక్క ఏడాదిలో మార్చుకోనూవచ్చును.

మా శాఖలతో దేనిలోనైనా సంప్రదించండి. ఒకే ఒక్క ఐదు నిమిషాలలో ఐఓబి క్యాష్ సర్టిఫికేట్ కొనవచ్చును.



**ఇండియన్ ఓవర్సీస్ బ్యాంక్**

మీ చిన్నక్కాన్నికైన ఉత్తమ మిత్రుడు




IOB 5A-81 Tel

## మంత్ర శక్తి

మంత్రాలన్నిటికీ గొప్ప శక్తి ఉంటుంది. పాము కరచినవారికి మంత్రం వేస్తే ప్రమాదం తప్పుతూ ఉండడం మనం చూస్తున్నాం. అయితే కొందరి మంత్రం పని చెయ్యకపోవడమూ ఉన్నది. మంత్రం ఒకటే అయినా, ఇలా వ్యత్యాసం ఎందుకు ఏర్పడింది? సరియైన పద్ధతిలో గురూపదేశం పొంది నియమ ప్రకారం జపించి, పునశ్చరణ చేస్తూ, నియమంగా ఉన్నప్పుడే ఏ మంత్రమయినా పని చేస్తుంది. లేకపోతే దానివల్ల ప్రయోజనం ఉండదు.

ఒకప్పుడు ఒక వేదవేత్త తన వూరునుంచి గ్రామాంతరం పోతూ, మధ్య ఒక అగ్రహారంలో మజిలీ చెయ్యవలసి వచ్చింది. ఆ వూరిలో ఒక వేద పండితుని గృహానికి అతడు అతిథి అయ్యాడు. ఆ పండితుని కుమారుడు ఉదయమే స్నానం చేసి, సంధ్యాదులు జరిపి, అరుగుమీద కూర్చుని తాను నేర్చుకున్న వేద భాగాన్ని వల్లె వేసుకుంటున్నాడు.

అతిథి సంతోషంతో "నాయనా! అధ్యయనం ఎంతవరకూ వచ్చింది? ఎప్పుడు ప్రారంభించావు?" అని ప్రశ్నించాడు. ఆ బాలుడు చెప్పిన సమాధానం విని "ఇంతకాలానికి ఈ మాత్రమేనా అయింది?" అని అసంతృప్తిని వెల్లడించాడు.

"మా నాన్నగారెన్నో నియమాలు ఏర్పరచారు. అందువల్ల శీఘ్రంగా కొనసాగ లేదండి!" అని ఆ పిల్లవాడన్నాడు.

తర్వాత కొంతసేపటికి "చాలా పొద్దయింది. ఇక మీరు స్నానం చెయ్యవచ్చును. వంట అయింది" అని ఆహ్వానం వచ్చింది. పెరట్లో నూతి దగ్గర స్నానం చెయ్యమన్నారు.

అతిథి పండితుడు అక్కడికి వెళ్లాడు. అక్కడ నీళ్లు చేదుకుందికి త్రాడూ, చేదా లేవు. ఆయన నిర్ఘాంతపడి నిలిచిపోయి "త్రాడూ, చేదా లేవు గదా! ఎలా స్నానం చెయ్యడం" అని అన్నాడు. అప్పుడు గృహ యజమాని చిరునవ్వు నవ్వి అబ్బాయిని పిలిచి "నాయనా! ఈయన చేత స్నానం చేయించు" అన్నాడు. పిల్లవాడు వచ్చి నూతి దగ్గర నిలబడి, చేతులు జోడించి వారుణ మంత్రాలు పఠించాడు. వెంటనే నూతిలోనుంచి ఒక జల ధార పైకి వచ్చి, ఆయనను స్నానం చేయించింది.

అతిథి ఆశ్చర్యానికి అంతం లేకపోయింది. సమగ్ర వేదాధ్యయనం చేసిన తాను, స్వల్పంగా అధ్యయనం చేసిన ఆ కుర్రవాని ముందు గడ్డిపోచగా కూడా కానరాలేకపోయి చాలా సిగ్గు పడి తల వంచుకున్నాడు.

తగిన పద్ధతిలో నియమంగా జపించినప్పుడే మంత్రాలు తమ శక్తులను పరితలకు అనుగ్రహిస్తాయి. నియమం లేకపోతే అవి పని చెయ్యవు.

— బులుసు వేంకటరమణయ్య

## 14 ముఖాల గడియారం!

ఎగువ బవేరియాలోని చిన్న సరస్సు ఒకదాని వొడ్డునున్న వో రెస్టారెంట్ యజమాని వద్దగల మూరేళ్ళనాటి టైంపీస్ — ఇటువంటి వాటి శ్రేణిలో యిదే ప్రపంచంలోకల్లా పెద్దది. ఆ హోటల్ యజమాని అంటన్ రిట్ చూపరులకు దీన్ని గురించి సంతోషంగా వివరిస్తూ యీ గడియారం బరువు 25 హండ్రెడ్ వెయిట్ లనీ, దీనికి గల 14 గడియారపు ముఖాల్లో నాలుగు వరుసగా బెర్లిన్, వియన్నా, మ్యూనిచ్ పారిస్‌లలోని సమయాన్ని ఒకేసారి సూచిస్తాయని అంటారు. అయితే 1982 మార్చిలో డస్సెల్ డార్ఫ టి.వి. టవర్‌పై నెలకొల్పే ప్రపంచంలోని అతి పెద్దదైన గడియారం అంత ఖచ్చితంగా సమయాన్ని సూచించలేకపోవచ్చని కూడా అంటున్నాడాయన!



# కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి.
# సులభంగా దెబ్బ తింటాయి.

# కాల్షియం-శాండోజ్
# ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు. అయినా అవి మీ పిల్లల పెరుగు దలకు, వికాసానికి అతిముఖ్యమైనవి. కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం. కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత పెళుసుతనం సంభవిస్తాయి. పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి.

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డకి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి. ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్టం చేయబడింది.

మీ బిడ్డడు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు. అది తిరిగి సమకూర్చాలి. లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది. మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు.

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మత్తు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి. అన్ని కాల్షియం బిళ్లలు ఒకటేకావు.

**కాల్షియం—శాండోజ్ మాత్రమే కావాలని అడగండి. మారుగా యిచ్చే ఏ యితర వాటి తోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్ — స్విట్జర్లండులోని శాండోజ్ వారిచేత పెంపొందించ బడిన అత్యుత్తమ మైన కాల్షియం.



**గట్టిపళ్లు, పటిష్టమైన ఎముకల కోసం కాల్షియం-శాండోజ్®**




daCunha/S-25 Rev/TL

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన
నాలుగు నూనెల సమ్మేళనం—
హపుషా (దేవదారు జాతి),
లవంగ పట్ట, లవంగ, నరళం.
రెక్సోనాతో స్నానం చెయ్యండి—
అది మీ చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది. మీరెంతో
ఇష్టపడే పరిమళాన్ని చర్మంపై
విలిపి గుబాళింపజేసే రెక్సోనా
మీ చర్మ సంరక్షణకోసం
సహజమైన సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్—RX. 78-2315 TL

# ఇదిగో!

క్రొత్త




## అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ కలిగిన క్రొత్త ప్రెస్టీజ్ మీరుకోన బోయే అతి భద్రమైన ప్రెషర్ కుక్కర్

ఆహార పదార్థములచే వెయిట్ వాల్వ్ మూయబడినచో మీ ప్రెషర్ కుక్కర్‌లో హెచ్చు ఒత్తిడి కలుగును. అట్టి సమయమున మీ కుక్కర్ భద్రత సేఫ్టీ ప్లగ్ మీదనే ఆధారపడియుండును మీ ప్లగ్ నకిలీదై వుండవచ్చు. మీకు తెలియదు...ఎందువలనగా మీరు అసలు సేఫ్టీ ప్లగ్‌ను నకిలీ ప్లగ్‌ను గుర్తించలేరు.

అందువలనే, పూర్తి భద్రత మనసులో ఉంచుకొని ఏమాత్రము ప్రమాదము జరగడానికి వీలులేకుండా, ఈ "క్రొత్త ప్రెస్టీజ్" రూపొందించాము. దీని అద్వితీయ గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ మీ కుక్కర్ భద్రతను ఎల్లకాలము కాపాడుతు సేఫ్టీ ప్లగ్ అవసరము లేకుండా చేస్తుంది.



### అద్వితీయమైన గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా క్రొత్త ప్రెస్టీజ్‌కు నూటికి నూరు పాళ్ళు భద్రత ఎలా సమకూరుతుంది?

సేఫ్టీ ప్లగ్‌ను త్రోసి వేసేంతగా ఒత్తిడి పెరుగకముందే అధిక ఆవిరి గేస్కెట్ రిలీజ్ సిస్టమ్ ద్వారా ఖచ్చితముగా బయటకు పోవును. నకిలీ లేక పాత "స్పేర్స్" వాడినను, మీ ప్రెషర్ కుక్కర్ పూర్తి భద్రతనిచ్చును. ఎల్లవేళలందు.



### క్రొత్త ప్రెస్టీజ్ మీకు ఎక్కువ సౌకర్యము నిచ్చును

గేస్కెట్ ఆవిరిని వొదిలిపెట్టగానే మీరు చేయవలసింది దాని స్థానము లోనికి దానిని తొయ్యడము మాత్రమే.
అప్పుడు మీ కుక్కర్ తిరిగి వాడకానికి కొన్ని క్షణములలో సిద్ధము.
సేఫ్టీ ప్లగ్గే అనవసరము. అందుచే దానిని మార్చే అవసరములేదు.

దాని గురించి చింతించనవసరములేదు.



### క్రొత్త ప్రెస్టీజ్ ఎంతో మన్నిక కలది

ఆవిరి ఒత్తిడి ఏ సమయమునైనను అపాయకరమైన స్థితికి చేరదు కనుక, కుక్కర్‌కు అరుగుదల చాల తక్కువ. అందుచేతనే మిగతా మామూలు కుక్కర్లకన్న క్రొత్త ప్రెస్టీజ్ చాలకాలము మన్నును.



### క్రొత్త ప్రెస్టీజ్ వల్ల ఎన్నో అధిక లాభములు

* ఎక్కువ మన్నికైన దళసరి అడుగు.
* మన్నికైన స్టెయిన్‌లెస్ స్టీలు స్క్రూలతో బిగించిన దృఢమైన పిడులు.
* ఎప్పుడు వేడెక్కని, పట్టునిచ్చు క్రొత్త "ఆక్సలరీ" పిడి.
* పరుత్వము, దృఢత్వము కలిగిన క్రొత్త "ట్రివెట్"
* అద్దములాంటి అందమైన తళతళ.
* ఉత్సాహము కలిగించు క్రొత్త వంటల పుస్తకము.
* అనుకూలమైన ఆరు సైజులు.

**మరియు ఏ లాభములవలన భారతదేశములో 30 సంవత్సరములకు పైగా ప్రెస్టీజ్ కుక్కర్ అందరికి కావలసిన కుక్కర్ అయినదో ఆ లాభములన్నీ ఇందులో వున్నాయి.**

**ttk తయారి.**



భారతదేశములో ప్రెషర్ కుక్కర్‌ను ప్రవేశపెట్టినవారు

# ఎన్నెన్ని కసుగాయల్ రాలె.....

పెద్దసీ



**వేసవికాలపు ఎండ తీవ్రతమూ, ఉక్కపోతమూ భరించలేక గది కిటికీలన్నీ మూసివేసి ఫ్యాన్ ఫుల్ స్పీడ్‌కి పెంచి బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' పుస్తకం చేతుల్లోకి తీసుకొని మంచంమీద మేను వాల్చాను.**

పుస్తకం చదువుతుంటే ఇంత చక్కని పుస్తకం యింతకాలం చదవలేకపోయినందుకు నన్ను నేనే తిట్టుకుంటూ పూర్తిగా కథలో లీనం అయిపోయాను. ఇంతలో కాలింగ్ బెల్ శబ్దంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చి, మంచం దిగి తలుపు తీయటానికి హాల్లోకి నడిచాను.

బహుశా శ్రీవారే అయ్యుంటారన్న నా ఊహ తలుపు తీయగానే ఎదురుగా నవ్వుతూ నిలబడివున్న రాములమ్మను చూడగానే తప్పని తేలిపోయింది. నల్లగా నిగనిగ లాడుతున్న శరీరానికి ఆకుపచ్చని చీర వింత అందాన్నిస్తుంటే, తలలో మల్లె మొగ్గలతో, నుదుట ఎర్రని కుంకుమతో, పెదవులపై చిరునవ్వుతో, అమాయకత్వాన్ని మొహం అంతా పులుముకొని నండూరివారి 'ఎంకి'లా రాములమ్మ నా ఎదుట నిలుచొని –

"మాటనీ సినిమాకెళ్తుండానమ్మగోరూ. పెందరాడే పనిచేసి పోదామని వచ్చినా" అంది.

ప్రక్కగా రాములమ్మ కొడుకు వెంకటేశ్వర్లు నన్ను చూసి సిగ్గుపడుతూ నిలబడ్డాడు. నేను ప్రక్కకు తప్పుకొని వాళ్ళిద్దరూ యింట్లోకి వెళ్ళటానికి మార్గం వదలి, వాళ్ళు లోపలికి రాగానే తలుపు గడియ వేశాను.

"ఒరేయ్ వెంకటేశ్వర్లూ ... నువ్వాడ కూచో. నేను పని చేసుకొని ఎంటనే వచ్చేస్తాను" అని కొడుకుని హాల్లో ఒక ప్రక్కగా కూర్చోబెట్టి పనిలోకి దిగింది రాములమ్మ.

వెంకటేశ్వర్లు బుద్ధిమంతుడిలా కూర్చొని హాల్లోని వస్తువులను పరీక్ష చేయసాగాడు. వాడిని చూస్తున్న నాకు వాడితో మాట్లాడా లనిపించి ఈజీ చైర్లో కూర్చుంటూ "ఏరా, బాగా చదువుతున్నావా?" అని అడిగాను. దానికి వినయంగా తలూపి సమాధానం



అందమైన సాయంకాలం...
ఇది క్యాంపా సమయం అది ఎంతో మధురం
Campa
Campa
Campa Cola
Campa
Campa
Campa Cola
క్యాంపా
లెమన్ ఆరెంజ్ కోలా
ఉరవళ్లు త్రొక్కే ఉల్లాసపానీయం క్యాంపా

KIRON /C/81/1

# సినిమా

## సంసారం - సంతానంలో సంతానం కోసం త్యాగం

"లావణ్యా, నీకు కావలసింది బిడ్డేగా? కావాలంటే అనాథాశ్రమంనుండి ఒక బిడ్డను తెచ్చుకుందాం," అన్నాడు శేఖర్ (శోభన్‌బాబు).

"నాక్కావలసింది ఎవరి బిడ్డో కాదు; మీరక్తం పంచుకుని పుట్టే బిడ్డ...ఆ బిడ్డలో అణువణువూ మిమ్మల్నే చూసుకోవాలి." లావణ్య (జయసుధ) కంఠంలో ఆత్రుత ధ్వనించింది.





'కోముల వంట'లో
చేతన

"నీ కోరిక బాగానే ఉంది, లావణ్యా! కాని, దానికి ఏ ఆడది ఒప్పుకుంటుంది?"

"ఒప్పుకునే ఆడది ఉందిగనుకనే చెప్తున్నాను."

"అయితే, ఆమె ఆడదై ఉండదు. ముక్కూ మొహం తెలియని మగవాడి బిడ్డను కడుపులో నవమాసాలు మోసి, కని, తనదికానట్టు తెంచుకోవటానికి తయారైన ఆడది ఎలాంటిదై ఉంటుందో!"

"అదెలాంటిదైతేనేం — నాక్కావలసింది మీ బిడ్డ."

"ఇంతకీ, ఆ అమ్మాయి ఎవరో?"

"అది ఈ జన్మలో మీకు తెలియదు. తెలియనివ్వను. భారతంలో వ్యాసుడంతటివాడే—సూర్యుణ్ణి, కుంతీదేవినీ ఎక్కడా కలపలేదు."

"లావణ్యా, నిజంగా నాకేమాత్రం ఇష్టం లేదు. నీకోసం ఒప్పుకుంటున్నాను."

"సాంప్రదాయం, సంస్కారం మధ్య పోటీపడే సరికొత్త కథా సంవిధానంతో ఈ చిత్రాన్ని రూపొందించాం," అన్నారు నీలిమా ప్రొడక్షన్స్ "సంసారం – సంతానం" చిత్రాన్ని సమర్పించే వి. బి. జి. తిలక్. సీమ, ప్రభాకరరెడ్డి, రమాప్రభ, కే. కే. కె. వి. చలం, కొర్లి రాఘవేంద్రరావు ఇతర పాత్రధారులు. ప్రముఖ తమిళ రచయిత్రి 'శివశంకరి' రాసిన కథకు ఆత్రేయ సంభాషణలు, చక్రవర్తి సంగీతమిచ్చారు. జూలై 2న విడుదలవుతుందని నిర్మాతలు కొత్తపల్లి రమేశ్‌బాబు, కొర్లి ఆంజనేయులు తెలిపారు.



'రుద్రతాండవం'లో సునీత

## గాయకుని గేయాలు

స్వయం కృషితో కన్నడం, హిందీ, తమిళం, మలయాళం, ఉర్దూ, ఆంగ్లం, సంస్కృత భాషలలో ప్రావీణ్యం సంపాదించిన రజతోత్సవ గాయకుడు పి.బి. శ్రీనివాస్, లోగడ ఎస్. జానకితో కలిసి గానం చేసిన స్వీయ ఆంగ్ల రచన "మేన్ ఆన్ ది మూన్"ను మెచ్చుకుంటూ అంతరిక్షయాత్రికుడు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అభినందన పూర్వకంగా లేఖ రాశాడు. అంతేకాదు; "మంచిరోజు" చిత్రంలో "చెప్పాలని ఉంది ... చెప్పేదెలా ?" అనే పాటను పి.బి.ఎస్. రాసి, ఆయనే పాడారు. "భాగ్యజ్యోతి" కన్నడ చిత్రానికి సంస్కృతంలో ఒక శ్లోకం, "మక్కళ భాగ్య" కన్నడ చిత్రంలో ఒక బహుభాషా గీతం రాశారు. "ఆకలి రాజ్యం"లో రాసిన హిందీ గీతం హిట్ అయింది. ఇంకా "నందు" తమిళ చిత్రంలో, "తుషారం" మలయాళం చిత్రంలో హిందీ గీతాలు రాశారు.

## విశ్వితార్థం

వెలినేని వెంకటేశ్వరరావు నిర్మాతగా మద్దిన నాగేశ్వరరావు సమర్పించే నాగమణి ఆర్ట్ పిక్చర్స్ "విశ్వితార్థం" చిత్రానికి జూన్ 11న తాలిగీతం ధ్వనిముద్రిక చేయబడింది. రాజాశ్రీధర్ కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వం వహిస్తూ హీరో కూడా రావుగోపాలరావు, నూతన్ ప్రసాద్, అల్లురామలింగయ్య, కాంతారావు, రాజ్‌బాబు, చిట్టిబాబు, ఆనందమోహన్, అర్జా జనార్దనరావు, కాశీరాం, కవిత, శుభ, విజయలక్ష్మి, సీలిమ, శివశ్రీ, మధుబాల, రాజశ్రీ, జ్యోతిలక్ష్మి ముఖ్య పాత్రధారులు. సత్యం సంగీత దర్శకుడు మహదేవ్ ఛాయాగ్రాహకుడు. వెంకటరత్నం కూర్పు, బాలు శిల్పం నిర్వహిస్తారు.

← 'ముద్దమందారం'లో →



ప్రదీప్,

# హిందీ చిత్ర విశేషాలు

★ మేఘాలయాలో తొలిసారిగా రాజశ్రీ వారి "తరానా" చిత్రం రజతోత్సవం చేసుకోబోతోంది. షిల్లాంగ్‌లోని సింఫెనియా థియేటర్‌లో ఆ చిత్రం ఇప్పటికీ హౌస్‌ఫుల్ కలెక్షన్లతో ప్రదర్శింపబడుతోంది.

★ నవీన్ నిశ్చల్ నిర్మాత అయ్యాడు. అతను నిర్మించే "జాన్‌సే ప్యారా" చిత్రంలో తొలిసారిగా ద్విపాత్రాభినయం చేస్తున్నాడు.

★ "వక్ సాటిన్" చిత్రానికి అప్జద్‌ఖాన్ తొలిసారిగా దర్శకత్వం వహించబోతున్నాడు. అతనితోపాటు శత్రుఘ్నసిన్హా, పర్వీన్‌బాబీ నటిస్తారు.

★ సుప్రసిద్ధ హిందీ కవి మజ్రూహ్ సుల్తాన్‌పూరి 'హకీమ్' కూడా. చాలామంది తారలకు యునాని మందులు ఇస్తుంటాడు.

★ పెద్ద టైటిల్‌గల హిందీ చిత్రం "జాత్ బిన్ మచ్లి, నృత్య బిన్ బిజ్లి". చిన్న పేరుగల చిత్రం "మా."

★ స్వర్గీయ షేక్ ముక్తార్ నిర్మించిన "నూర్జహాన్" చిత్రం మన దేశంలో ఫ్లాప్ అయితే, పాకిస్థాన్‌లో వినోదపు పన్ను రూపేణా రెండు కోట్ల రూపాయలు అక్కడి ప్రభుత్వానికి ఆర్జించి పెట్టింది.

★ అహమ్మదాబాద్‌లోని అలంకార్ థియేటర్‌లో "మాంగ్ భరో సజనా" చిత్రం ప్రదర్శింపబడుతోంది. పక్షం రోజుల కొకసారి అయిదు టిక్కెట్లను ఒకసారి కొన్న మహిళలలో ఒకరిని లాటరీ పద్ధతిమీద ఎన్నిక చేసి, వారికి 500 రూపాయలు ఖరీదు చేసే చీరను ఆ థియేటర్ యజమాన్యం బహూకరిస్తోంది.



పూర్ణిమ

★ రాజ్‌సిప్పీ దర్శకత్వం వహించే "జోష్" చిత్రంలో విద్యాసిన్హా తొలిసారిగా వాంప్ పాత్ర ధరిస్తోంది.

★ "నసీబ్" చిత్రానికి టిక్కెట్లు దొరక్క నాగపూర్‌లో ఒకతను ఆత్మహత్య చేసుకున్నాడు.

★ జియా వుల్‌హక్ పాకిస్థాన్ అధ్యక్షుడైనప్పట్నుంచీ ఇంతవరకు 533 చిత్రాలను నిషేధించాడు. వాటిల్లో 52 పాకిస్థాన్‌లో తయారైనవి.

★ 1931 మార్చి 14న తొలి వాక్చిత్రం "ఆలం ఆరా" విడుదలైనప్పట్నుంచీ ఈ యాభై ఏళ్ళలో [1981 మార్చి 13 వరకు] 5,247 వాక్చిత్రాలు విడుదలయ్యాయి.

★ పాకిస్థాన్‌లో 300 మంది చిత్ర నిర్మాతలు దరఖాస్తులు పంపిస్తే, వాటిల్లో 48మాత్రమే ఆమోదింపబడ్డాయి. పాకిస్థాన్‌లో ప్రభుత్వపు అనుమతి లేనిదే చిత్రాలు నిర్మించడానికి వీల్లేదు.



'జయసుధ' లో ఒక దృశ్యం



# చక్రబంధం



ఆకెళ్ల వెంకట సూర్యనారాయణ

వచ్చేసింది. ధనలక్ష్మి జేబు ఎక్కేసింది.

ప్లాస్టిక్ పర్సులో ముడిచిపెట్టుకుని కూర్చుంది. ధనలక్ష్మి వస్తూ ఆనందాన్ని తేలేదు సరికదా ఆవేదన తెచ్చింది. వచ్చే ముందు మూడు రోజులూ, వచ్చిన తర్వాత మూడు రోజులు... ప్రతి నెలా కలతనిద్ర, ఆలోచనలు. గుండెలమీద చేయి వేసుకుని నిద్ర పోనివ్వదు.

లక్ష్మి చంచల చిత్తురాలు. ఆఫీసు గేటు దాటకుండానే పరుగులు.

"కామ్రేడ్! యూనియన్ చందా!"

క్లబ్ చందా గురూ...

సెండాఫ్ పార్టీ టు సెక్షన్ ఆఫీసర్ బాస్ బ్రదర్! ఎవడో పోయేడు. వాడి కుటుంబానికి రిలీఫ్. క్యా భాయ్ వడ్డీ!

లక్ష్మి ఊరుకుంటుందా! వాళ్ళ దగ్గరకు చేరిపోవటం మొదలెడుతుంది.

ఈవాళ అలాగే చేరిపోయింది. అన్ని పోను బేలన్స్ నాలుగొందలు... పది... ముప్పయి... నలభై... మొత్తం మిగిలింది. ఫోర్‌ఫిఫ్టీ.

"మా ఆయనకు జీతం ఏడు వందల అరవై" మట్టుపక్కల వాళ్ళకు వాణి చెప్పే జీతం. ఆ మాట చెప్పేటప్పుడు ఆ ముఖంలో వెలుగు, పుచ్చుకునేటప్పుడు దిగులు.

పి. ఎఫ్. కంట్రిబ్యూషన్, లోను, ఇన్సూరెన్సు, పండగలోను... సైకిలులోను... తుఫానులోను...

అవును. తుఫాను లోను అంటే గుర్తొచ్చింది. వంశీధార వరదలొచ్చేయిగా... శ్రీకాకుళం జిల్లాలో ఇల్లు, వాకిలి ఉంటే వరద ఎడ్వాన్సు ఇస్తారని ఇందాకా... వైద్యనాథ్ చెప్పేడు.

వైద్యనాథ్ చిత్రమైనవాడు. మెడికల్ బిల్సుతో ఇల్లు కట్టేసి సార్థక నామధేయుడయ్యేడు. డాక్టరుకి, మెడికల్ షాపుకి పర్సెంటేజిట.

సరే ఆగొడవెందుకు. తనూ వరద ఎడ్వాన్సు పెట్టాలి. ఉర్లం కరణాన్ని పట్టుకుని అక్కడో తనకో పాక ఉండేదని... వరదల్లో కొట్టుకు పోయిందని కాగితం పుచ్చుకోమని సూరికి రాయాలి.

ప్రభుత్వాన్ని మోసగించటం తప్పేమో... ప్రభుత్వం అంటే ఎవరూ? ప్రజలు... ఆ ప్రజల్లో తనూ ఒకడు. అంటే తనని తనే మోసం, ఆత్మవంచన.

తను మాత్రం ఏం చేస్తాడూ? తను ఉద్యోగం జాయిన్ అయ్యేనాటికి తన జీతం రెండు వందల అరవై. ఆ రోజు కాసు బంగారం, మూట ముప్పయి. నెల జీతంతో పెళ్ళికి వాణికి రెండు కాసులు బంగారం కొన్నాడు. ఇప్పుడు తన జీతంతో అరకాసు బంగారం వస్తుందా? అనుమానమే. ఖరీదులు పదిరెట్లు పెరిగితే జీతం...మూడు

రెట్లు పెరుగుతోంది. అవసరాలు పెరుగుతున్నాయి.

ఎవరామ్మాయి ? బస్సు కదుల్తుంటే ఎక్కుతోంది. జగదీశ్వరిలా ఉందే. కాదు. జగదీశ్వరి ఎక్కడుందో ? 'పేపర్ షీట్' అని పేరెట్టి ఆమెని కాలేజీ డేస్‌లో ఏడిపించేవాడు. ఆ రోజులు వేరు. నడి వయసు వచ్చేసింది.

మరో పదేళ్ళుపోతే ఆ ముసలాయనలా వంగి ఎడవాల్సిందే. ముసలాయన పక్క నెవరూ ? కూతురయి ఉండమ్మ. నిండుగా ఉంది. పొట్ట ఎత్తుగా ఉంది. నీళ్ళోసు కుందేమో.

యస్. ఇంటి దగ్గర పూర్ణా నీళ్ళోసు కుంది. నాన్‌సెన్స్ నీళ్ళోసుకోవటం ఏమిటి? వాళ్ళు నీళ్ళోసుకున్నా, నిప్పులోసుకున్నా, తనకేం అభ్యంతరం లేదు. కాని అమ్మ –

"ఒరేయి. ఆడది తొలిచూలుకి తల్లి చాటుకి, చంటి బిడ్డలా చేరాల్సిందేరా! పూర్ణని పురిటికి తీసుకొచ్చేవు. సంతోషం. నాన్న లేకున్నా – మా అన్న పురిటికి తీసుకొచ్చేడని – అది సంబరపడిపోతోంది. సూడిదలిచ్చి తెచ్చేం. ఇక ఆ గాజుల వేడుక కూడా జరిపేస్తే బావుంటుంది. పెద్దదానికి మీ నాయన బ్రతికున్నారుగనక పెళ్ళిలా ఆర్భాటంగానే చేశారు. అంతలా నువ్వు తూగలేవు. అయినంత మాత్రంచేత ఆడపిల్ల పుట్టింట అచ్చట, ముచ్చట కోసం ఆశ పడకుండా ఉండదు కదా... ఎలాగో గాజుల వేడుకా... జరిపేస్తే అదీ సంతోషిస్తుంది. మళ్ళీ ఇక ఆఖరిదాని పెళ్ళయి, దాని కడుపునో కాయ కాసినపుడు కాని ఆ ముచ్చట ఉండదు కదా ?"

నిజమే! అమ్మ చెప్పింది. వాళ్ళ కడుపుల్లో కాయలు కాస్తున్నాయి. కాని రూపాయలు చెట్లకి కాయడంలేదే ? ఎలా ?

'అన్నయ్యా! ఇదిగో ఈ పట్టు పరికిణీ, వోణి పాపాయమ్మగారి ద్వారా... అరువు తెచ్చేను. నూట నలభై అయింది. నెలకో ముప్పయి ఇమ్మంది.'

కళ్ళు విప్పేసరికి కడుపున బుట్టిన కుర్రాడ్ని ముందేసుకుని గృహలక్ష్మి –

'వీడికి కాన్వెంటు సీటు ప్రయత్నం చేసేరా ? ప్రక్కింటామె... ఇట్టే వెళ్ళి మూడు వందలు కట్టి పిల్లాడ్ని చేర్పించి చక్కా వచ్చింది. మీరు బద్ధకిస్తే ఒక్కగా నొక్క కుర్రాడి భవిష్యత్తు దెబ్బతింటుంది. తర్వాత ఎటూ ఆడవాళ్ళేగా...'

ఏమిటీ! బస్ ఇంకా రాదు. పోనీ నడిచి పోతే జీతంవాడు నడకే... పండగవాడు పాతమొగుడే... పండగంటే గుర్తొచ్చింది. దీపావళి ఇదే నెల... ఈ జీతమే దీపావళ్ళి సాగనంపాలి. పెద్ద చెల్లెలు గాజులు...చిన్నదాని బట్టలు, కుర్రాడి కాన్వెంట్ జాయినింగ్... మై గాడ్!

పాశాలు... ఇవన్నీ పాశాలు... సిగరెట్ కాలిస్తే బావుణ్ణు.

'ఓ బర్కిలీ ఇవ్వు.'

పదిహేను పైసలా ... పెట్టె రూపాయి నలభై ... సిగరెట్ కొక పైసా పోతుందే... పేకెట్ కొంటే ... తను టెంప్ట్ అయి ఎక్కువ కాల్చేస్తాడు. అన్నీ ఆలోచించే వాళ్ళు ధర నిర్ణయిస్తారు. బిజినెస్ పీపుల్.

వాడెవడి దాకానో ఎందుకూ? ఇందాకా... కామేశం ఉరఫ్. షైలాక్ ఏమన్నాడూ ?

"గురూ ... నన్ను షైలాక్ అంటారని నాకు తెల్సు. షైలాక్ గడువుపెట్టి గడువు దాటితే మాంసం అడిగేడు. కాని నేను గడువే పెట్టనే! నువ్వు నూటికి పది వడ్డీ ఇస్తున్నంత కాలం...గడువు ప్రశ్నేలేదు..." అంటూ నలభై బ్యాగ్‌లో వేసుకుని వెళ్ళిపోయేడు.

కామేశం అమెరికాలో పుట్టాల్సినవాడు. వాడు తాతాకి, బిర్లాకి పెర్సనల్ క్లాసులు తీసుకోగలడు.

పోనీ ... ఈ నెల వాణ్ణే అప్పు అడిగితే ? లాభం లేదు. వాడిదివరకు టైపిస్టు అప్పు అడిగితే చెప్పలేదా ?

"గురూ ... ప్రతి వాడికి దేవుడు ఆయుర్దాయం ఫిక్స్ చేసినట్లు, నేను వాడి అప్పు కెపాసిటి ఫిక్స్ చేసుకుంటాను. నీ ఆయుస్సుకి సరిపోయే అప్పు ఇచ్చేశాను. ఇంక అడగకు" తేలిగ్గా అనేసేడు. తన్ని అలాగే అనేయగలడు.

బస్సు ఆశవదిలేసి నడిచేయటం బెటర్. ఎవరామె ? అందంగా ఉంది. కునేగా వాసన ఎప్పుడో కాలేజీ డేస్‌లో తనూ వ్రాసేడు. ఆ రోజుల్లో లెక్చరర్ బిందుమాధవరావుని చూసి ఇన్‌స్పైయిర్ అయి లెక్చరల్ కావాలనుకున్నాడు.

గుమాస్తా అయ్యేడు.

రోడ్డుమీద డ్రయినేజ్ మూతలేదు. తన బోటివాళ్ళు పడిపోతారు. తమ బ్రతుకుల డ్రయినేజ్‌కి మూతలుండవు. సంసార కూపంలో ఇరుక్కుపోవాల్సిందే!

నిన్నరాత్రి పద్దు ప్రకారం ఖర్చు తొమ్మిదొందలు. అంటే సుమారు అయిదొందలు అప్పు. అప్పెక్కడా ?

అప్పారావ్‌లా తిరగాల్సిందే! ఋణానందలహరి రాసిందెవరూ ? జీనియస్



← 'ముద్దమందారం'లో →

# హిందీ చిత్ర విశేషాలు



ప్రదీప్,



పూర్ణిమ

★ మేఘాలయాలో తొలిసారిగా రాజశ్రీ వారి "తరానా" చిత్రం రజతోత్సవం చేసుకో బోతోంది. షిల్లాంగ్‌లోని సింఫొనీ యా థియేటర్‌లో ఆ చిత్రం ఇప్పటికీ హౌస్‌ఫుల్ కలెక్షన్‌లతో ప్రదర్శింపబడుతోంది.

★ నవీన్ నిశ్చల్ నిర్మాత అయ్యాడు. అతను నిర్మించే "జాన్‌సే ప్యారా" చిత్రంలో తొలిసారిగా ద్విపాత్రాభినయం చేస్తున్నాడు.

★ "హార్ పాటిస్" చిత్రానికి అమ్జద్‌ఖాన్ తొలిసారిగా దర్శకత్వం వహించబోతున్నాడు. అతనితోపాటు శతృఘ్నసిన్హా, పర్వీన్‌బాబీ నటిస్తారు.

★ సుప్రసిద్ధ హిందీ కవి మజ్రూహ్ సుల్తాన్‌పూరి 'హకీమ్' కూడా. చాలామంది తారలకు యునాని మందులు ఇస్తుంటాడు.

★ పెద్దపెద్ద టైటిల్‌గల హిందీచిత్రం "జాల్ బిన్ మఛ్లి, నృత్య బిన్ బిజ్లి". చిన్న పేరుగల చిత్రం "మా."

★ స్వర్గీయ షేక్ ముక్తార్ నిర్మించిన "నూర్జహాన్" చిత్రం మన దేశంలో ఫ్లాప్ అయితే, పాకిస్థాన్‌లో విడుదలై ఎన్నడూ రూపేణా రెండు కోట్ల రూపాయలు అక్కడి ప్రభుత్వానికి ఆర్జించి పెట్టింది.

★ రాజ్‌సిప్పీ దర్శకత్వం వహించే "జోష్" చిత్రంలో విద్యాసిన్హా తొలిసారిగా వాంప్ పాత్ర ధరిస్తోంది.

★ "నసీబ్" చిత్రానికి టిక్కెట్లు దొరక్క నాగపూర్‌లో ఒకతను ఆత్మహత్య చేసుకున్నాడు.

★ జియా వుల్‌హక్ పాకిస్థాన్ అధ్యక్షుడైనప్పట్నుంచీ ఇంతవరకు 533 చిత్రాలను నిషేధించాడు. వాటిల్లో 52 పాకిస్థాన్‌లో తయారైనవి.

★ అహమ్మదాబాద్‌లోని అలంకార్ థియేటర్‌లో "మాంగ్ భరో సజనా" చిత్రం ప్రదర్శింపబడుతోంది. పక్షం రోజులకొకసారి అయిదు టిక్కెట్లను ఒకేసారి కొన్న మహిళలలో ఒకరిని లాటరీ పద్ధతిమీద ఎన్నిక చేసి, వారికి 500 రూపాయలు ఖరీదు చేసే చీరను ఆ థియేటర్ యజమాన్యం బహూకరిస్తోంది.

★ 1931 మార్చి 14వ తారీఖు వాక్చిత్రం "ఆలం ఆరా" విడుదలైనప్పట్నుంచీ ఈ యాభై ఏళ్ళలో [1981 మార్చి 13 వరకు] 5,247 వాక్చిత్రాలు విడుదలయ్యాయి.

★ పాకిస్థాన్‌లో 300 మంది చిత్ర నిర్మాతలు దరఖాస్తులు పంపిస్తే, వాటిల్లో 48మాత్రమే ఆమోదించబడ్డాయి. పాకిస్థాన్‌లో ప్రభుత్వపు అనుమతి లేనిదే చిత్రాలు నిర్మించ డానికి వీల్లేదు.



'జయసుధ'లో ఒక దృశ్యం






రిజల్ట్స్
నాన్నగారూ! నేను ఈసారైనా పరీక్ష పాసవ్వాలనుంటే, మా మాష్టారికి లంచం యిచ్చి రండి!!
ఏమిట్రోయ్! రిజల్ట్స్ పేపర్లో వచ్చాయని చూడబోతే ఎవరు తీసుకెళ్ళారో.... ఇంతకూ ఏమైంది నీ రిజల్ట్స్?


నీ రిజల్ట్స్ వచ్చినట్టున్నాయి! 'ఏమైందిరా' అంటే, ఎదురింటి రవి, పక్కింటి రఘు, వెనకింటి రాము అందరూ తప్పారని చెప్తావే!!


నేను ఫెయిల్ అయ్యానని అలా వందసార్లనాలా! ఇప్పుడు పాసయ్యి చేసేదేముంది! ఎటూగా నిరుద్యోగ సమస్యేగా!!


నేను ఈసారైనా పాసౌతానా స్వామీ! చూసి చెప్పండి!
అది.. నీ పక్కనున్నవాడు వ్రాసిందాని మీద ఆధారపడివుంది! బాబూ!!


ఏదో క్రిందటిసారిలా ఈసారి కూడా కంప్యూటర్ ధర్మమా - అని పాసయితాననుకున్నాగానీ..!

"ఇన్నాటి సంఘటన తల్చుకుంటేనే కంపరం ఎత్తుతూంది ... నిజమే ... వాళ్ళంతా రాక్షసుల్లా ప్రవర్తిస్తుంటే నేను మాత్రం పూర్తిగా కదిలిపోయాను. ఏదో .. ఏదేదో చేసేయాలన్నంత ఆవేశం కలిగిందంటే నమ్మండి .." కాఫీ త్రాగినాక ... హేంకీతో పెదాలద్దుకుంటూ అంది.

క్రింది పెదవి వెనక్కి విరిచి చిత్రంగా నవ్వాడతను మాటలకతను "మనమెంత మంది రోగిష్ఠులను ... దారిద్ర్యదష్టులను చూడడంలేదని... మృత్యువును మరెంత సన్నిహితంగా చూడడంలేదు ... చూసినంత మాత్రాన...ఎంతమంది బుద్ధులవుతున్నారు .. మహాత్ములెంతమంది అవుతున్నారని .. అదంతే శివానిగారూ... కొందరెంత చిన్న విషయానికి కదిలిపోయి కంటతడి పెడ్తారో ...మరికొందరు పూర్తిగా ప్రపంచం కళ్ళముందు మండిపోతున్నా పట్టించుకోరు ... ఎంపరర్ నీరోలాగ...' చిరునవ్వుతోనే చెప్పాడు

గుండెల్ని పిండివేసే ఆ స్వంత అనుభవాన్ని అతడంత నిర్లిప్తంగా నిర్వచించుకుంటూంటే కళ్ళు పెద్దవిగా చేసుకుని చూసింది శివాని

"అయితే...అయితే మీకేం బాధ కలగలేదా... ఆ విషయాన్ని అంత మామూలుగా తీసుకున్నారా..." వుండబట్టలేక అడిగింది.

"అవిటి వాడినయినా హృదయమున్న మనిషిని ..బాధ ఎందుకుండదు...అయినా... అయినా ఒక్కటా ... రెండా... పాతికేళ్ళుగా ప్రతిక్షణం ఎదురయ్యే ఇలాంటి అనుభవాలు అలవాటయి బాధించడం మానేసినయి ... ఎప్పుడో అలాంటి సందర్భాల్లో తప్ప అసలు అవిటివాడిననే విషయమే గుర్తుకు రాదు..." అప్పుడుమాత్రం మనసారా నవ్వుతూ చెప్పాడు.

"ఏమో ... మీ స్థితిలో నేనుంటే ... తట్టుకోలేకపోయేదాన్నేమో ... గుండెలు పగిలి చచ్చిపోయేదాన్ననిపించింది రియల్లీ..."

'లేదు శివానిగారూ...మీకా పరిస్థితిరాదు కాబట్టి అలా అనుకోవడం సహజం. మీ స్థానంలో నేనుంటే... నేనూ అదేమాట అనే వాడినేమో మరి! కాని... ఈ కాలం వుంది చూశారూ... చాలా విచిత్రమైనది. ఎంతటి దుర్భరపరిస్థితులో నయినా సరే... బతకడానికి ఊపిరిలూదుతుంది. దానిదృష్టిలో ఈ సృష్టిలోని ప్రాణాలన్నీ సమానమే ... లేనట్టయితే... మనిషికలా తపించగల శక్తే కనక వున్నట్టయితే ఈ సృష్టి ఏనాడో లయమైపోయి... ఎప్పుడో తల్లకిందులయ్యేది..."

## వూపిరి

(18వ పేజీ తరువాయి)

ఆ తర్వాత కొన్ని నిముషాలదాకా కాఫీ కప్పులోకి చూస్తూ మౌనంగా కూర్చుండిపోయిన శివాని హఠాత్తుగా అడిగింది "ఎక్కడుంటున్నారు" అంటూ.

"విద్యానగర్... తాతముత్తాతలు సంపాదించిన రెండు గదుల యిల్లు వుంది... ఆ యిక వెళ్దామా... క్లాసుకు టైమయినట్టుంది.." టేబిల్ పై సమంగా పెట్టుకున్న ఆమె చేతి గడియారంలోకి తొంగి చూస్తూ అన్నాడు.

## చూడు! సూర్యుణ్ణి

పగలనక రేయనక
రక్తాన్ని చెమటగా ధారపోస్తూ,
తింటానికి తిండిలేక,
ఉంటానికి గూడులేక,
ఆకలి దప్పులతో అలమటించే
ఓ కష్టజీవి !
తోడూ నీడా ఎవరూ లేరని
'ఓరి దేవుడా' అని అలమటిస్తావేం?
సూర్యుడు కరుణ కాంతులు
ప్రసరింపచేస్తూ ఉంటే
మండుటెండ అని ఏడుస్తావేం ?
సరిగ్గా చూడు !
పగలంతా నువ్వు పడిన కష్టాన్ని చూసి
సానుభూతి భావంతో
'రక్తాశ్రువులను' రాలుస్తూ
నిన్ను వదలలేక, వదలలేక,
పశ్చిమాద్రి వెనుకకు
పోతున్నాడు దినకరుడు రక్తపుముద్దలా !

—"శాంతి"

"ఓ, అయామ్ సారీ.. చాలా సేపయింది కదూ.." నొచ్చుకుంటూ లేచింది తను కూడా...

క్యాంటీన్ బయటకు వచ్చినాక మాత్రం... పరిసరాల్లోని ప్రతి చూపూ తమపైనే పారాడుతున్నట్టు గమనించింది శివాని ఎడమ వేపు నుండి పడుతున్న నీరెండలో ముందుకు వాలిన ముంగురుల నీలినీడలు తేటగా మిసమిసలాడే చెక్కిళ్ళపై అల్లరిగా నాట్యమాడుతుంటే... ఆరోగ్యంగా ఎదిగిన అవయవాలు పొందిగ్గా కట్టినచీరలో మరింతగా హొయలు పోతున్నప్పుడు... వేళ్ళు ముందుకు కట్టుకుని అతడికోసం నడుస్తున్నట్టు... నెమ్మదిగా అడుగులో అడుగులేస్తున్న ఆమె పక్కన... అతడేమిటి దిష్టిబొమ్మలా... అన్ని వైపుల్నుంచీ విసురుతున్న చూపుల్ని... శివాని మాత్రం గమనించీ... గమనించనట్టుగానే నడిచింది ఆర్ట్స్ కాలేజి మెట్లదాకా...

"మీకెలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో తోచడంలేదు. నాజీవితంలో మొదటిసారిగా... నన్నొకమనిషిగా.. తోటివిద్యార్థిగా గుర్తించిన వ్యక్తిని చూశాను... చాలా థాంక్స్..." మెట్లెక్కబోతూ... ఒక్క క్షణం ఆగి అంటున్న అతడి కళ్ళల్లో తళుక్కున మెరిసిన తడిని చూసి చకితురాలయింది శివాని.

"తనేం చేసిందని ... మనిషిని మనిషిగా చూడక... యింకెలా సాధ్యం..." ఏదో అంటా మనసులోనే... వంకర నడకతో మెట్లెక్కుతూ వెళ్ళిపోయాడతను

అలా పెరిగిన పరిచయం...ఆ పవిత్రమైన విశ్వవిద్యాలయ ప్రాంగణంలో నివురుగా...ఎదిగి అందమైన స్నేహానికి పూలబాట వేసింది

* * *

ఆనాడు సంధ్య వాలుతూంది. లైబ్రరి నుండి హాస్టలుకు వెళ్తుంటే కనిపించాడు వంశీకృష్ణ... లా కాలేజీ ముందున్న బస్సు స్టాపులో... అల్లనేరేడు చెట్టు కింద కూర్చుని వున్నాడు ఒంటరిగా...

"ఏమిటీ... ఇంత పొద్దుపోయిందాకా వున్నారూ..."దగ్గరగా వచ్చి... పలకరించింది.

"ఆహా... ఏమీ లేదండీ... ప్రొఫెసరు గారింటికి వెళ్ళి కొన్ని నోట్సు తెచ్చుకోవడం మూలాన..." చెప్తూ... లేవబోయాడు

ఛటుక్కున భుజం పట్టి ఆపింది శివాని "ఫరవాలేదు... కూర్చోండి... కూర్చోండి' అంటూ.

ఆ స్పర్శకు ఒక్కసారిగా కుంచించుకుపోయాడతను... కొన్ని క్షణాలదాకా ఏదో అనుభూతికి లోనయి... ఆ స్థితిలో తలెత్తి ఆమెవేపు చూడలేకపోయాడు...

అతడిలోని ప్రతి కదలికను జాగ్రత్తగా గమనిస్తున్న ఆమె మాత్రం...ఆ సంధ్యాదేవి సిగలోని ఎర్రగులాబీలా... పల్చగా నవ్వింది "అయామ్ సారీ... మీరు లేస్తుంటే పడిపోతారేమోనన్న ఆదుర్దాతో... అప్రయత్నంగా నే తాకాను..." అవసరం లేకున్నా...సంజాయిషీ చెప్పుకుంది మంద్ర స్వరంలో

( గత సంచిక తరువాయి )






అంతనా అర్ధరాత్రమున శ్రీకృష్ణుడు పాండవులు సామాన్యవేషములు ధరించి రహస్యముగ కౌరవ శిబిరంబునకు వచ్చిరి.





















పదియవ నాటి యుద్ధం ప్రారంభమయింది. ఉభయసైన్యములు ఢీకొని భీకరముగ పోరాడ సాగినవి... రాను రాను యుద్ధము మధ్యాహ్నము దాటే సరికి మహా భయంకరముగనున్నది...... అంత...

[ఇంకా ఉంది]

అప్పుడూ... మాటలు దొరక్క బలవంతంగా... బలహీనంగా నవ్వాడు.

ఇక ఆ తర్వాత మాత్రం ముందుకు సాగడం చాలా కష్టమయింది... కాసేపటి తర్వాత శివానే అంది 'ఇక వెళ్తా' నంటూ.

మంత్రముగ్ధునిలా తలూపడం తప్ప ఏమీ కనపలేకపోయాడు వంశీకృష్ణ..

* * *

"ఆ మాత్రం స్పర్శకే ఎంత పులిక్కిపడ్డాడో బాబాయ్... నీ అనే కాదు ... అలాగే మరీ... పూర్తిగా తాకలేదేమో నన్ను అంత కలవరపడిపోయాడు.. అతడి నా స్థితిలో చూస్తుంటే జాలితో హృదయం తల్లడిల్లిందంటే నమ్మండి!" కుర్చీలో వెనక్కువాలి చెప్పింది శివాని.

'పాపం! కొత్త జీవితం లేదమ్మా.. మనకెంతో సాధారణంగా కనిపించే విషయాలే వారికెంతటి అపురూపాలు... దురదృష్టవంతుడు సంఘం మొదటి నుండీ అతడిని అంటరానివాడిగా దూరంగా వుంచింది... అందుకే.. ఒకవ్యక్తి అందులోనూ వయసూ అందం వున్న ఒక యువతి అంత ఆప్యాయంగా తాకినప్పుడు... నమ్మలేకపోయాడు. రియల్లీ ఇంటరెస్టింగ్ కేరెక్టర్... అయ్ పిటీ హిమ్ బేబీ..." వదులుతున్న పుస్తకాన్ని మడిచి పెడుతూ అన్నాడు రాజశేఖరం.

"నిజమే.. మనిషిలో పూర్తిగా నమ్మకాన్ని చంపుకున్నాడు అలాంటివాళ్ళు ఎలా ప్ర

# వూపిరి

గ్గారో...ఎవరైనా హఠాత్తుగా ఎదురుపడి 'నిన్ను ప్రేమిస్తున్నాను!' అంటే ఎలా రియాక్ట్ అవుతారో మరి. అవునూ... జైలు వార్డెనుగా ... సూపరింటెండెంట్‌గా... ఐ. జి. ఆఫ్ ప్రిజన్స్‌గా మీకెన్నో అనుభవాలున్నాయి... ఎప్పుడైనా ఇలాంటి వ్యక్తులను చూశారా బాబాయ్..." కుతూహలంగా ముందుకు జరిగి కూర్చుంటూ అడిగింది.

ఆ మాటలకు చిన్నగా... శబ్దం కాకుండా నవ్వాడాయన. "జైలు ఆవరణలో నాకు తారసపడిన ప్రతి ఖైదీ... ఈ సమాజంపై నమ్మకాన్ని చంపుకున్నవాడేనమ్మా...అప్పింటిలోనూ... ఒక థ్రిల్లింగ్ ఎక్స్‌పీరియన్స్ చెప్తాను... రామయ్య అని వ్యక్తిగా మంచివాడే... కాని ఒక హత్య కేసులో వురిశిక్ష పడింది... ఇంక నెల రోజుల వ్యవధి వుందన్నప్పటినుండీ అతడిలో సంఘర్షణ మొదలయ్యింది...తన నీడను చూసి తనే భయపడిపోయేవాడు. జైల్లో ఎక్కడో... ఏదో అలికిడయినా... గుండెలోనే కెవ్వుమనేవాడు... చివరికేస్థితికి వచ్చాడంటే ... ఎప్పుడయినా వార్డర్ తలుపువద్ద కెళ్ళేవాడు... గబగబ వణకుతూ మూలకు నక్కేవాడు ..భోరున ఏడ్చేసేవాడు... అలా ఇరవై రోజులు గడిచినాయి..." మిగిలివున్న కాఫీని పూర్తి చేయడానికన్నట్లు... చెప్పడం ఆపాడు.

ఆ మధ్య కాలాన్ని భరించలేక పోయింది శివాని 'తర్వాత (తొందర) బాబాయ్... ఆ తర్వాత... ఆ పది రోజుల్లో ఏం జరిగింది' ఆదుర్దాగా అడిగింది

"చల్లబడ్డిందమ్మా...వన్ మినిట్..." అంటూ పనమ్మాయికిగాని చెప్పలేదాయన "ఆ తర్వాత... నే నెప్పుడు కనిపించినా దీనంగా చూసేవాడు .. ఏదో చెప్పాలన్నట్లు...అర్థిగా చూసేవాడు అతడి అవస్థను గమనించి ఒకనాడడిగాను-

"రామయ్యా... ఏమయినా చెప్పాలా..." ఆ మాత్రం ఆప్యాయతకే తల్లడిల్లిపోయాడతను. దుఃఖం పట్టలేక భోరున ఏడుస్తూ కాళ్ళు పట్టుకున్నాడు.

ఆ క్షణం నాకేమీ పాలు పోలేదు "ఛ ... యిదేమిటయ్యా ... వూరుకో..." అంటూ బలవంతంగా లేవదీశాను.

"నాకు చావాలని లేదయ్యా...నిజ వున్నది నిజమే కాని...హత్య మాత్రం చేయలేదు .. నాకు భయమేస్తూంది... మీ కంత నమ్మకం లేకపోతే...మనుషుల్లోకి కాదు ... అడవుల్లోకి వెళ్ళిపోతాను... జీవితాంతం అక్కడే బ్రతుకుతాను...నన్ను విడిచిపెట్టండి..." గుండెలవిసేలా రోదిస్తూ చెప్తున్న అతడిని చూస్తుంటే బేబీ ... నా కళ్ళు చెమ్మగిల్లినయి. కాని...నేను మాత్రమేం చేయగలను... నేనెవరిని...

కాని... ఆ చివరి దినం ... శిక్ష అమలు జరపడానికి రెండు గంటలు ముందు ... హైకోర్టు నుండి స్పెషల్ మెసెంజరు ... నురగలు కక్కుతూ పరుగెత్తుకొచ్చాడు."

ఆ క్షణం శివాని శరీరం అప్రయత్నంగానే జలదరించిపోయింది ... వూపిరి బిగబట్టి నిటారుగా కూర్చుంటూ ... వినబోయేదాని కోసం ఆత్రంగా నిరీక్షించింది.

"అసలు హంతకుడు దొరికాడని... రామయ్య వురిశిక్ష ఆపేయాలని ... 'స్టే' ఆర్డర్ తెచ్చాడు..."

"మై గాడ్..." ఉత్సుకతను భరించలేక ...గుండెలపై చేయి వేసుకుంటూ అరిచినంత పని చేసింది శివాని ఆ మాటలు వింటూనే.

"అవును బేబీ ... అయ్ టూ ఫెల్ట్ ఎక్సైటెడ్...వందగజాలయినా ... రామయ్య సెల్ వద్దకు వెళ్ళడానికి కొన్ని గంటలయినట్లనిపించింది..."

కన్ను మూసిన మరుక్షణం మళ్ళీ దావురు మన్నాడు...



# సమృద్ధమైన
# పంటలకు



## అనువైన ఎరువులను సమర్థవంతంగా ఉపయోగించండి









వరిపంటకు విజయ్ 24-24-0 తగిన ఎరువు

సిఫార్సు చేసిన ఎరువుల మోతాదు

| | | ఎకరానికి కిలోలలో |
|---|---|---|
| పైరు | దుక్కిలో విజయ్ 24-24-0 | పైరు మీద విజయ్ యూరియా |
| అధిక దిగుబడి వరి | 100 | 50 |
| దేశవాళీ వరి | 50 | 25 |

విజయ్ 24-24-0 ను దుక్కిలో ఆఖరు దమ్ములో వేయండి. పైరు మీద విజయ్ యూరియాను సమాన మోతాదుల్లో రెండు దఫాలుగా వేయండి. త్వరగా కోతకువచ్చే రకాలైతే విత్తనాలు చల్లిన 40 రోజులకు మొదటిసారి, 50 రోజులకు రెండవసారి వేయండి. మధ్యరకం లేదా దీర్ఘకాలిక రకాలైతే. విత్తనాలు చల్లిన తర్వాత 45 రోజులకు ఒకసారి, 75 రోజులకు రెండవసారి ఉపయోగించండి.
ఎరువులు ఇంకా సమర్థవంతంగా వినియోగపడటానికి ప్రతి

5 కిలోల యూరియాతో ఒక [illegible] సపిండి కలిపివేయండి యూరియా వేసేముందు పొ[illegible] ను తీసివేసి 48 గంట[illegible] తర్వాత మరల నీరుకట్టండి.

ఇంకా వివరాలకు ఈ క్రింది కనబరిచిన చిరునామాకు వ్రాసి పై పంటకుసంబంధించిన పుస్తకాన్ని తెప్పించుకొనండి

## పైర్ల సరియైన పోషణకు
# విజయ్



ఏరియా మేనేజరు
మద్రాసు ఫర్టిలైజర్సు లిమిటెడ్
44, కాంతినగర్
హైదరాబాద్-500 028




HTM-MFL-2499

# పూపిరి

"ఊరుకో రామయ్యా ... ఊరుకో !" నిర్వచించలేని వుద్వేగంతో వెంటనే ఆ వార్త చెప్పలేకపోయాను...

"అయ్యగారూ...నన్ను విడిచిపెట్టండి... మీరు చెప్తే... వాళ్ళు వింటారయ్యా...నాకు చావాలని లేదు..." హృదయ విదారకంగా ఏడిచాడు.

"ఊరుకో రామయ్యా ... నిన్ను వురి తీయడం లేదు... అసలు హంతకుడు దొరికాడు..." దడ దడ లాడే గుండెలతో ఎలాగో చెప్పాను.

ఆ క్షణం...ఎవరో కంఠం నొక్కినట్టు ...ఏడుపు ఆగిపోయింది నమ్మలేనట్టుగా ... నిర్వేరపోయాడు రామయ్య...

"అవును నిన్ను వురి తీయడంలేదు ... త్వరలో విడుదల కూడా చేస్తారు..." అతడి భుజాన్ని నొక్కుతూ చెప్పాను.

అప్పుడు నవ్వాడతను...పగలబడి నవ్వాడు. ఆ నాలుగు గోడలే కాదు ... పూర్తి జైలు ఆవరణంతా దద్దరిల్లి పోయేటట్టు ... ఆ ఆకాశం కూలిపోతున్నట్టు భయంకరంగా విరగబడినవ్వాడు...అలా...అలా...నవ్వుతూనే వున్నాడు చివరకు ... నవ్వడం చేతకాక ... స్పృహతప్పి పడిపోయాడు...

పరీక్ష చేశాక చెప్పాడు డాక్టరు...ఊహించని ఆ వార్తకు తట్టుకోలేక మతి చలించిందని...

అప్పటివాకా బిగపట్టిన పూపిరి తో వింటున్న శివాని 'గాడ్' అంటూ కుర్చీలో వెనక్కు వాలింది.

"అవును బేబీ... ఇలాంటి సంఘటనలు కథల్లోనే కాదు... అరుదయినా... నిజ జీవితాల్లోనూ సంభవిస్తాయి..." చెప్పడంపూర్తి చేసి; "ఇక పడుకుందాం బేబీ... నువ్వూ పడుకో... హాస్టలుకు రేపు వెళ్ళొచ్చు... నేనొచ్చి దిగబెడతాను..." అంటూ లేచాడు రాజశేఖరం...

* * *

పరీక్షల రోజులు రావడంతో... అంత కాలంగా అలుముకున్న రణగొణ ధ్వనులన్నీ సద్దుమణిగి... విశ్వ విద్యాలయ పరిసరాలన్నీ స్తబ్దుగా మారినయి. ప్రశాంతమైన ఆ నిశ్శబ్దంలో...ముడుచుకుపోయిన వంశీకృష్ణ గుండెల్లోని ఆత్మవిశ్వాసానికి నిండుగా ఊపిరి లూదింది శివాని. ఎవరెన్ని విధాలుగా చెప్పుకున్నా... పర్వతంలా చలించని ఆమె అందమైన హృదయమే... స్నేహానికొక నిర్వచనమైనప్పుడు... ఆ నిండు హృదయంలోని సంస్కారాన్ని... అభిమానాన్ని... ఆప్యాయతనూ... తనివిదీరా అనుభవించాక... సృష్టి అంతా కొత్తగా తోచిందతడికి...ఆ సృష్టిలో తనూ ఒక విడదీయరాని భాగమన్న సత్యం ఆమె సాంగత్యంలో... సాన్నిధ్యంలో బోధపడినప్పుడు.. తనంత అదృష్టవంతుడు పూర్తి లోకంలోనే లేడని తృప్తిగా గుండెలపై చేయి వేసుకున్నాడు

ఆ రోజుల్లోనే . ఒకనాడన్నాడు, "మన పరిచయమయి ఏడాది కావస్తున్నా... ఒక విషయం అంతుపట్టటంలేదు శివా... నాలో ఏంచూసి...ఇంతమంది యిన్నుకుంటున్నా... ఎంతోమంది నీ స్నేహం కోసమే కాదు... కడగంటి చూపయినా చాలని తపించిపోతున్నా నాలో ఏముందని శివా...స్నేహం చేశావు..."

"పిచ్చి వంశీ ... ఫిలాసఫీలో మాస్టర్ డిగ్రీ చేస్తున్నావు... యీ మాత్రం తెలియదా...ఏ పూవయినా పతితసిగలోనూ... పతివ్రత సిగలోనూ ఒకే విధంగా సువాసనలు విరజిమ్ముతుంది స్నేహమూ అంతే...అలకు వేందుకొక స్వచ్ఛమైన మనస్సు కోసం ఆరాటపడుతుందే కాని... ప్రత్యేకతలకు ప్రాధాన్యత నివ్వదు... ఎదుటి వ్యక్తి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్ది ఎలాంటి పరిస్థితుల్లోనూ వంగిపోకుండా సానపడుతుందేకాని.. ప్రత్యేకతలకోసం వెతుక్కోదు . నీ స్నేహమంటే స్నేహపూరితమైన వెన్నెలాంటి నీ హృదయమంటే నాకు ప్రాణం... జీవితాంతం మన స్నేహకుసుమమిలాగే గుబాళిస్తుండాలనేది నేనెప్పుడూ ఆశించే వరం... నిజం వంశీ... పవిత్రమైన స్నేహం దొరకడమన్నది జీవితంలో ఒక అపురూపమయిన విషయం..." చల్లని ఆ వాతావరణంలో...మరింత చల్లగా చెప్పుకుపోయింది. ఆ మాటలు వింటూ ఆమెనే తేరిపార చూస్తున్న వంశీకృష్ణ పూర్తిగా స్పందించి పోయాడా క్షణం.

"నిజం శివా... నాకు మాత్రం నీ స్నేహమొక అపూర్వమైన వరమే... లేకపోతే... లేనట్టయితే... వెనెలా బ్రతగ్గలిగేవాడిని... జీవితాంతం... పాతికేళ్ళుగా లోలోనే సుడులు తిరిగిన ఆవేదన... అనుక్షణం రంపపుకోత కోసిన అవిటితనం... ఒంటరితనం నేనిప్పుడి

వన్నీ పూర్తిగా మరచిపోయాను శివా... ఈ జీవితానికేకాదు ఎన్ని జన్మలెత్తినా నీ ఋణం తీర్చుకోలేమ'' ఆర్ద్రంగా అన్నాడు.

"ఏమో ... అంతంత మాటలు ... నీ స్నేహమూ నా కెన్నో కొత్త విషయాలు బోధించింది...ఈ సమాజపు దృక్పథాన్ని ... ఈ మనుష్యుల మనస్తత్వాలనూ కొత్తకోణం నుండి శోధించే అవకాశం కలిగించింది. నీ అనుభవాలతో...నీ జీవితంతో నేను మాత్రం ఎన్ని నేర్చుకోలేదని...ఇక ఋణమంటావా... మన స్నేహమిలాగే ... ఎలాంటి పరిస్థితుల్లో నయినా ... ఇలాగే నిదిగిపోతే చాలు ... ఒకరి ఋణమొకరం తీర్చుకున్నట్లే...'' అరచేతిని మృదువుగా స్పృశిస్తూ చెప్తూంటే ...వంశీ కృష్ణ హృదయం మాత్రం ఆ స్నేహ పరిమళాలను నింపుకుని ఆకాశపు టంచుల దాకా ఎగిరిపోయింది.

* * *

"వెంటనే బయలుదేరి రమ్మని పూరి నుండి టెలిగ్రాం వచ్చింది వంశీ...సాయంత్రం వెళ్ళున్నాను...'' ఆ నాడు క్లాసు నుండి పిలిపించి చెప్పింది శివాని.

ఆందోళనగా చూశాడా మాటలకు వంశీ కృష్ణ.

"ఏమోవంశీ... అమ్మకెలా వుందో... అసలే గుండెపోటు మనిషి...'' అంటుంటే ఆమె కంఠం పూడుకుపోయింది.

"ఏం జరగదు శివా... నీలాంటి అమృత హృదయులకు ఆ భగవంతుడే కష్టమూ కలిగించడు... అంత సాహసం అతడి కుండదు...'' ధైర్యం చెప్తూ, గోడనానరాగా వంకరగా నిల్చున్నాడు వంశీకృష్ణ... ఆమె కను మరుగయేదాకా అలాగే చూస్తూ వుండి పోయాడు ఆనాడు.

* * *

ఇంటిముందు వాకిట్లో బండి దిగగానే... ఎదురుగా కనిపించిన రవీంద్రను చూస్తూనే ఆశ్చర్యంతో తలమున్కలైంది శివాని. ఇదా విషయం... ఇందుకా టెలిగ్రామిచ్చింది... ఆనందంతో గుండెలు ఎగిరిపడుతుంటే... పరుగెత్తుకెళ్ళి చేయి పట్టుకుంది "ఎప్పు డొచ్చావు బావా... హైదరాబాదులో కలవ లేదేం...'' అంటూ.

"రెండు నెలల సెలవుంది... పరీక్షలు కదా... అయిన తర్వాత కలవవచ్చని అను కున్నాను... కాని సడన్‌గా వార్ స్టార్టయింది శివా... వెంటనే జాయిన్ కమ్మని ఆర్డర్స్ వచ్చినయి. అందుకే...''

ఆ మాటలు వింటూనే నివ్వెరపోయింది శివాని... "అదేమిటి బావా... యిప్పుడు యుద్ధమేమిటి... అసలెందుకు...'' అప్రయత్నంగా అడ్డుకుంది కళ్లల్లో నీలినీడలు అలుముకుంటూంటే.

అది చూసిన రవీంద్ర హృదయంకలుక్కు మంది. అయినా బయటకు కనిపించనీయ కుండా... భుజాలు పట్టుకుని లోనికి నడిపించాడు... "పిచ్చిపిల్లా... యుద్ధమెందుకు వచ్చిందంటే ఏం చెప్పను... నివరైనా ఏమని చెప్తారు... అశాంతి పెంచి... శాంతిని స్థాపించాలంటే ఈ హింసా... యుద్ధాలూ తప్పవు. ఇక అశాంతి ఎందుకంటే..అదంతే.. మనిషెప్పుడూ అంతే... అశాంతిలోంచే ఈ నాగరికత మొగ్గలు తొడిగి పూలు పూసింది. ఆ పూలు వాడిపోకుండా... రాలిపోకుండా కాపాడుకునే ఆరాటంలో మళ్లీ అశాంతి... ఆ అశాంతిలోంచి పుట్టే ఈ యుద్ధాలూ... యిదంతా ఒక వలయం శివా... అయినా... యుద్ధమెందుకూ అని ఆలోచించడం సైనికుడిగా నా బాధ్యత కాదు... ఆలోచించ కుండా పోరాడడమే నా కర్తవ్యం. అయామ్ ట్రెయిన్డ్ దట్ వే... ఓకే డార్లింగ్...కాస్త విశ్రాంతి తీసుకో... ఆ తర్వాత మాట్లాడు కుందాం...'' ఆప్యాయంగా వీపు నిమురుతూ చెప్పకు పోతూంటే... అశ్రుపూరితాలయిన కనుదోయిని కనిపించనీయకుండా గబగబా లోనికి నడిచింది శివాని.

"ఏమో బాబూ ... పెళ్లి యిప్పుడా ... తర్వాతా అనేది మీరిద్దరూ కలిపి నిర్ణయించు కోవలసిన విషయం, యిందులో నా ప్రమేయం వుండదు...'' ఆ రాత్రి భోజనాల వద్ద తన అభిప్రాయాన్ని చెప్పాడు వరంధామయ్య.

* * *

"ఏమో శివా ... యుద్ధానికి మరోపేరు మృత్యుముఖ మంటారు ... ఏమో ... నేను మాత్రం ఏమని చెప్పను... అందుకే శివా ... వచ్చినాక ..''

మందంగా వున్న వెన్నెల సమతలంగా ... సముద్రంలా పరచుకొని వుంది. ఆ వెన్నెల్లోని చల్లదనాన్నంతా జారుకుని గంతులు వేస్తున్న పిల్లగాలి...ఆ పిల్లగాలి అల్లరికి ... మరింత అల్లరిగా ఎగురుతున్న అతడి ముంగురులనే చూస్తూ...వింటూ వుండిపోయింది శివాని.

"మాట్లాడు శివా ... నీ అభిప్రాయం కూడా...''



"నా మనసు తెలియనా బావా..." అంటున్నప్పుడు...ఆమె కంఠం సన్నగా వణికింది.

"అదికాదు...నాకేదయినా..."

అప్పటిదాకా కనుపాపల్లోనే మెలికలు తిరిగిపోతున్న కన్నీరిక ఆగలేకపోయింది తటాలున ముందుకు వాలి ... ఆ మాటలు పూర్తి చేయనీయకుండా నుదురుతో ఆ పెదాలను బలంగా నొక్కేస్తూ ... అప్పుడు ఏడ్చింది శివాని విశృంఖలంగా...

ఆ కంఠాన్నలాగే పెనవేసుకుని ... వడి శిరస్సును కనురెప్పలతోనే ముద్దుపెట్టుకుంటూ మౌనంగా ఓదార్చాడు రవీంద్ర.

ఎవరికీ చెప్పకుండానే...ఎవరినీ ఆహ్వానించే వ్యవధి లేకుండానే...వూరికి వుత్తరంగా వున్న వెంకటేశ్వరస్వామి గుడిలో నిరాడంబరంగా జరిగిపోయింది పెళ్ళి.

ఆ తర్వాత మూడురోజులకే ... ఎన్నో ఆశలను...మరెన్నో కలలను గుండెల్లో నింపుకుని కన్నీటితో వీడ్కోలిస్తున్న శివానిని... ఆ గుమ్మంలోనే ఒంటరిగా వదలి యుద్ధభూమికి వెళ్ళిపోయాడు కెప్టెన్ రవీంద్ర

అప్పుడు రవీంద్ర లేని ఆ రాత్రి నిద్రాదేవి దూరంగా పారిపోయినప్పుడు గాని స్నేహితులకు ముఖ్యంగా వంశీకృష్ణకు వుత్తరం వ్రాసే అవకాశం దొరకలేదు.

పరీక్షలకు వచ్చేసరికి ... వంశీకృష్ణ కనిపించలేదు...పరీక్షలకు హాజరు కాకుండానే వెళ్ళిపోయాడు. వాకబు చేస్తే యిల్లు అమ్మేసి పోయాడని తెలిసింది ... ఎక్కడికో మాత్రం...ఎవ్వరికీ తెలియదు...అంతే!

ఆ తర్వాత ... మళ్ళీ ఇప్పుడు ... యిన్నేళ్ళకు...పదేళ్ళు కాలేదూ...

రవీంద్రకు కల్నల్‌గా ప్రమోషనొచ్చి ... డార్జిలింగ్‌లో పోస్టింగయినాక ... బాబును కాన్వెంటులో చేర్పిద్దామని వెళ్ళిన శివాని ... అక్కడి ప్రిన్సిపాల్‌ను చూస్తూనే అవాక్కయి పోయింది...ఆ క్షణం విపరీతమైన వుద్వేగంతో...హృదయం స్వాధీనం తప్పి ... ఒక్కసారిగా గతంలోకి కూరుకుపోయింది...

"ఎన్నాళ్ళయింది శివా..." చెమ్మగిల్లిన కళ్ళను టప టప లాడిస్తూ అన్నాడు వంశీకృష్ణ చాలా సేపటికి...

ఆ మాటలకి లోకంలోకి వచ్చిన శివాని... బుజాలనిండుగా కప్పుకున్న శాలువాతో కళ్ళద్దుకుంటూ సమాధానం చెప్పకుండా ...

# వూపిరి

ఆ రోజు సాయం సమయాన... అలసిపోయిన సంధ్యాదేవి తన కనురెప్పలను... బరువుగా... అతి నెమ్మదిగ వాల్చుకుంటోంది. ఆ కడగంటి చూపుల చల్లని కిరణాలు తాకినప్పుడు... చుట్టూరా వున్న తెల్లని మంచుకొండలు మరింత తెల్లగా మెరుస్తూ... వింతకాంతులీనుతున్నాయి.

"ఇన్నాళ్ళ ఒంటరిగా ఎలా వున్నావు వంశీ..." కాఫీ త్రాగడం సగంలోనే ఆపి హఠాత్తుగా అంది శివాని

ఆ మాటలకు అదో విధంగా నవ్వాడు వంశీకృష్ణ "నేను ఒంటరినెలా అవుతాను

## భూగోళం వయస్సంత వయస్సు

సముద్రాల అడుగున బిలియనాది సంవత్సరాల క్రితం నిక్షిప్తమైన సూక్ష్మ జీవుల ఖనిజ వనరులకు ప్రధాన 'నిర్మాతలు' అని సోవియట్ విజ్ఞానశాస్త్ర పరిషత్తు శిలా స్వరూప స్వభావాలను పరిశోధించే విభాగంలోని శాస్త్రవేత్తలు నిర్ధారించారు

ప్రాచీన శిలాశేషాలలోని జీవపదార్థాలను అధ్యయనం చేసి, వీటిలో ఎంతో ఇనుము, రాగి, మాంగనీసు, టంగ్స్టన్, తదితర ఖనిజాలు వున్నట్లు నిర్ధారించారు ఈ నిధులు యేర్పడడంలో జీవపదార్థాల నిర్మాణాత్మక పాత్ర వహించినట్లు సోవియట్ యూనియన్‌లో వివిధ ప్రాంతాలలో నిర్వహించిన పరిశోధనలు స్పష్టం చేశాయి సముద్రగర్భాలలో అపారంగా గల ఏకకణ జీవి అల్గే జీర్ణావశేషం ఫలితంగానే ఈ నిధులు ఉత్పన్నమైనట్లు వీరు నిర్ధారించారు

శివా... నీవు నింపిన స్నేహ పరిమళాలు నాలో యింకా గుబాళిస్తూనే వున్నాయి... ఆ జ్ఞాపకాల సంగీతాలు అనుక్షణం తోడుగా వుంటూ... నన్నింకా తీర్చిదిద్ది... యిలా బతికిస్తున్నాయి నిజం శివా...ఆ నాడు పెళ్ళి జరిగిందన్న నీ వుత్తరం చూసుకున్నాక ఏమో విపరీతంగా భయపడిపోయాను... నీ స్నేహానికి దూరమయి... మళ్ళీ ఒంటరిగా... అందరూ గేలిచేసే ఒక అవిటివాడిగా బతకాలంటే భయమేసి పారిపోయాను... చచ్చిపోవాలనుకున్నాను కాని... నీకు జ్ఞాపకముందో... లేదో... ఒకనాడు చెప్పావు... 'మన జీవితం ఎంతటి జీవితాన్ని కూడా వెలిగించాలని... మనలో వెలుగులు నింపుకోవడమే కాదు... యింకో బతుకులోనూ కాంతి పుష్పాలు పూయించాలని!' ఆ పలుకులే శివా...ఆనాడు నీవు నింపిన ఆ వూపిరే నన్ను బతికించింది. ఈ స్కూలును స్థాపించి ఎనిమిదేళ్ళవుతుంది. తల్లిదండ్రులు తమ పిల్లల బంగారు భవిష్యత్తును వెతుక్కుంటూ దేశం నలుమూలల నుండీ వస్తున్నారిక్కడికి... అది చాలదూ నేను బతికి వుండడానికి..." దూరంగా కేరింతలు కొడుతూ... ఆడుకుంటున్న పిల్లల వేపు చూస్తూ చెప్పుకుపోయాడు

ఒకనాడు చెప్పనయితే చెప్పిందేమోకాని... అప్పుడు ఆ మాటలు వింటున్నప్పుడు మాత్రమే తెలుసుకుంది తన స్నేహానికి అంత శక్తి వుందని... సముద్రంలాంటి ఒంటరితనం ప్రతిక్షణం వెంటబడి నవ్వే అవిటితనం... కలలో కనిపించినా వెక్కిరించే జీవితం... వీటన్నిటి మధ్యా... ధైర్యంగా...సంతృప్తిగా బతకడానికి ... తన స్నేహమే వూపిరి పోసిందన్న ఆ అపురూపమైన విషయం వింటున్నప్పుడు ఈ జీవితానికిది చాలనుకుంటే తృప్తితో కళ్ళు చెమ్మగిల్లుతుంటే...

భోజనాలయినాక... వెళ్దామనుకుంటున్నప్పుడు చెప్పింది శివాని, "బాబుకు నీ పేరే పెట్టుకున్నాం వంశీ... వాడి అదృష్టమేమో మరి... నీ చూపుల్లోకే వచ్చాడు... వాడిని నీ అంతటి వాడిగా...వూహూ. యింకా... యింకా... నీ కన్న వున్నతుడిగా తీర్చిదిద్దాలి..."

ఆమాటలకు గీతలానవ్వుతూ సమాధానం చెప్పకుండా "పదశివా కారుదాకావస్తాను" అంటూ లేచిన వంశీకృష్ణ కాలు జారింది... ముందుకు తూలిపోయాడు.

కనురెప్పపాటులో... బుజాల క్రిందుగా చేతులు వేసి ఒడిసి పట్టుకుంది శివాని, "వయసు పైబడుతూంది వంశీ... కాస్త జాగ్రత్తగా వుండాలి... పద... నేను నడిపిస్తాను..." అంటూ...

కారు కనుమరుగవుతున్నప్పుడు మాత్రం అరచేతి వెనక భాగంతో కళ్ళు తుడుచుకుంటూ... పూర్తిగా వంగిపోయి యింటివేపు నడిచాడు వంశీకృష్ణ చల్లటి గాలికి శరీరం సన్నగా వణికిపోతుంటే.

# కుళాయిలో మూత్రం!

బెంగుళూరు రసెల్ మార్కెట్టు ప్రాంతవాసులు మొన్న తొమ్మిదో తేదీ నీటికుళాయి ప్రాతఃకాలంలో తెరిస్తే వచ్చిన నీళ్ళు వో రకమైన వాసన, కొంచెం పసుపురంగులో దాదాపు మూత్రంలా ఉన్నాయట. మంచినీళ్ల కుళాయిలలో మూత్రం ధారా ప్రవాహంగా రావడం సంభవమేనా అని ఆశ్చర్యపోయారు జనులు. తీరా ఆ నీటిని ప్రయోగశాలకు పంపి పరీక్ష చేయిస్తే ఆ నీటిలో కొంత శాతం మూత్రం ఉన్నట్లు తేలిందట. రసెల్ మార్కెట్టుకు వచ్చినవారు పోసే ఒంటేళ్ళు తీసుకుపోయే గొట్టం బొక్కపడి, ఆ పక్కనే ఉన్న మంచినీటి గొట్టం మీదికి ప్రవహించిందట. ఇదివరకే చిన్న చిన్న కన్నాలున్న ఆ మంచినీటి గొట్టం ద్వారా యీ మూత్ర జలధార మంచినీటితో కలిసి ప్రజలను పావనం చేయడానికి పంపుల ద్వారా ప్రవహించిందట. దాంతో ఆ నీరు మూత్ర జలంగా మారిందట— యాక్కురారి !

## మోసపు రంగు !

బొంబాయిలో డాక్టరు సుశీల్ చంద్రశర్మ అనే వో మేధావి అత్యంత అధునాతన భవనంలో వుండేవాడట. తాను రంగులు చేయడంలో అమోఘ విజయం సాధించినట్లు, పాణిశాల రంగులకు తన రంగులే మాత్రం తీసిపోనట్లు చెప్తూండేవాడట. టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో టెక్నికల్ సలహాదారుడుగా ఉండేవాడట. తనవద్ద పది లక్షల రూపాయలు కిమ్మత్తు చేసే రంగులున్నాయనీ, అవి బజారులో సునాయాసంగా ముప్పయి లక్షల రూపాయలకు అమ్ముడు పోతాయనీ చెప్తూండేవాడట. ఇంట్లో ప్రయోగశాలా వగైరాలూ చాలా పెద్ద పెట్టున వుండేవట. హేమంత్ వ్యాస్ అనే వో పెద్ద వ్యాపారవేత్తతో యీ విషయాలు అతను ముచ్చటించాడట. వ్యాస్ వయస్సులో



చిన్నవాడే అయినా అనుభవంలో పెద్ద వాడవడం వల్ల తాను రంగుల ఫ్యాక్టరీకి లక్షలకొద్దీ పెట్టుబడి పెట్టక పోయినా, సుశీల్ శర్మ వద్దనున్న సరుకు కొనడానికి సిద్ధమని చెప్పి శాంపిల్ తీసుకువెళ్లి పరీక్ష చేయించాడట. ఆ రంగు అమోఘమని తేలిందట. మార్కెట్టులో ధరలు విచారించగా సుశీల్ శర్మ చెప్పినట్లు మూడురెట్లు ( కొన్న ధరకు) ధరకు అమ్మచ్చునని తేలిందట. అన్ని విషయాలూ ఖరారు చేసుకున్నాక హేమంత్ వ్యాస్ తాను పదిలక్షలు డబ్బురూపేణా యిచ్చేందుకు ఒప్పుకున్నాడట. సెప్టెంబరు 10వ తేదీ శనివారానికి హేమంత్ వ్యాస్ వద్ద తొమ్మిది లక్షల ముప్పయ్యయిదువేలే జమపడ్డాయిట. మిగతా అరవైయ్యయిదు వేలూ సోమవారం యిచ్చే పద్ధతిలో ఒప్పందం జరిగిందట. వ్యాస్ తన సెక్రటరీతో శర్మ నివాసానికివెళ్లి డబ్బుయిచ్చి, గోడవును తాళాలు తీసుకున్నాడట. శర్మ తానా డబ్బు బ్యాంకులో కట్టాలని బయల్దేరి వెళ్లిపోయాడట. వ్యాస్ గోడవునుకువెళ్లి రంగు డ్రమ్ములను వెంటనే అమ్మివేయాలన్న ఉద్దేశ్యంతో వో డ్రమ్ము దొర్లించేసరికి గల్లున శబ్దం వచ్చిందట. ఇదేమని చూస్తే ఆ డ్రమ్ములో మూడొంతులు మట్టి, రాళ్లువేసి, ఆపైన రేకుతోమూసి, ఆపైన కొంచెం రంగుపోసి ఉందట. అన్ని డ్రమ్ములూ అంతేనట. వెంటనే వ్యాస్ గామ్‌దేవి పోలీసుస్టేషనులో రిపోర్టు యిచ్చాడట.

శర్మ జామ్మని వో నలుగురు వేశ్యా సుందరిలను తీసుకొని పాల్లీలో తానంతకు ముందే తీసుకున్న యింట్లో వో పదిరోజులు గడిపి, అక్కడ నుంచి వారితో నాసిక్‌వెళ్లి అక్కణ్ణుంచి ఢిల్లీ వెళ్లిపోయాడట. పోలీసులు బొంబాయి నుంచి ఢిల్లీ వెళ్లి అతను కొన్న ఇంపాలా కారుకోసం గాలిస్తే మహారాణిబాగ్ ప్రాంతంలో ఆకారు కనబడ్డదట. రోజంతా కాపుకాస్తే సాయంత్రానికి శర్మగారు టిప్‌టాప్‌గా కారువద్దకు వచ్చేరట. వేచిఉన్న పోలీసులు ఆయన మీదికి లంఘించి వాటేసుకున్నారట. అక్కణ్ణించి ఆతన్ని విమానంలో బొంబాయి తీసుకు వచ్చారట. అతిభద్రంగా ఆర్థర్‌రోడ్డు జైలులోపెట్టి కాపలా కూర్చున్నారట. బోరివిల్లీ కోర్టులో శర్మమీద వో మోసంకేసు ఉన్నదని ఆ కోర్టు శర్మను కోర్టుకు హాజరు పరచవలసినదని ఆర్డరివ్వడంవల్ల పోలీసులు సుశీల్‌చంద్రశర్మను కోర్టుకు తీసుకు వెళ్లారట. ఆ కేసు విచారించిన న్యాయమూర్తి కేసుపెట్టినవ్యక్తి కోర్టుకురానందు వల్ల చిరాకుతో సుశీల్‌చంద్రశర్మను నిరపరాధిగా పేర్కొని విడుదల చేయమని తీర్పునిచ్చి వెళ్లిపోయాడట. శర్మ తరపు న్యాయవాదు లిద్దరు శర్మను పట్టుకున్న పోలీసులను డబాయించి "నిరపరాధి అని కోర్టు తీర్పు యివ్వడం వినలేదా ! ఇంకా ఆయన్నెందుకలా పట్టుకుని నిలబెట్టారు. వదలండి" అని చటుక్కున ఆ శర్మతో వో కారులో వెళ్లిపోయారట.

ఈ పదిలక్షల కేసుకథ మాటేమిటని పోలీసులు ఆలోచించేలోగానే శర్మగారు అంతర్ధానమై పోయారట. మళ్లీ వేట ఆరంభమ్.

## న్యాయవాదిపై దాడి !

భీమవరానికి చెందినవెంకటరత్నం అనే న్యాయవాది ఇంటికి అక్టోబరు 10 వ తేదీ (1980) అర్ధరాత్రి ఎవరో నిప్పంటించారట. ఇంట్లో ఖరీదైన వస్తువాహనాలూ, పుస్తకాలూ కాలిపోయినా ఆయనా, ఆయన కుటుంబమూ బ్రతికి బయటపడ్డారట. ఈ సంఘటన జరిగిన పది రోజుల్లో ఎవరో ఆయన మీద ద్రావకం పోశారట. నిద్రపోతూండగా ఆయన మీద ద్రావకం అపాద మస్తకం పోయడంవల్ల ఒళ్ళంతా కాలిబొబ్బలెక్కి పోడమేగాక, ముఖమంతా వికృతంగా అయిపోయి, ఒక కన్ను పేలిపోయి, చావు బ్రతుకుల మధ్య హైదరాబాదు ఉస్మానియా ఆసుపత్రిలో వూగిసలాడుతున్నారుట. ఈ రెండు సంఘటనలలోనూ స్థానిక పోలీసు అధికారులు సరియైన దర్యాప్తు జరపనే లేదట. భీమవరం సర్కిల్ ఇనస్పెక్టరు దర్యాప్తుకు రానేలేదట. సబ్ ఇనస్పెక్టర్ ఏదో మొక్కుబడి చెల్లించుకోడానికి వచ్చినట్లు వచ్చారట. వెంకటరత్నం క్రిమినల్ కేసులలో అందెవేసినచెయ్యిట. గత ఆరేళ్లుగా ఎంతోమందిని శిక్షనుంచి తప్పించారట. ఆయన పట్టుకున్న ఏ కేసులోనయినా పోలీసులకు వోటమేనట — అదీ కథ !





# డిస్కో

## మాచెర్ల హేమ

“సారీ సుధా! నీవు నాతో జీవించ లేవు.” సుధ గుమ్మంలో అడుగు పెట్టగానే “స్టీవ్” అన్న పైమాటలు పదే పదే సుధ మనసు కలవర పెడూ చెవులలో ప్రతిధ్వనిస్తున్నాయి.

తనిప్పుడు ఎక్కడికి వెళ్ళాలి? తలిదండ్రులకూ తను అక్కర్లేదు ఏరికోరి చేసుకున్న స్టీవ్‌కూ తన అవసరం లేదు. కాదు స్టీవ్ అన్నట్లు తను అతనితో జీవించలేదు. తను ఆ జీవితం భరించలేదు. పార్క్‌లో బెంచీపై కూర్చున్న సుధకు ప్రపంచమంతా గిర్రున తిరుగుతున్నట్లనిపించింది. చటుక్కున తన పెళ్ళి ముందు తల్లి చెప్పిన మాటలు గుర్తుకొచ్చినై.

“సుధా! పెళ్ళి స్త్రీకి జీవితంలో అతి ముఖ్యమైన మలుపు. ఆ మలుపులో అతి జాగ్రత్తగా ముందు వెనుకలు బాగా ఆలోచించి అడుగు వెయ్యాలి. ఇప్పుడు నీ జీవితాన్ని నీవే ఒక కొత్త బాటలోకి మళ్ళిస్తున్నావు. మరి ఆ బాటలో సుఖాలకు సంతోష పడుతూ, కష్టాలను ధైర్యంగా ఎదురుకుంటూ నీ జీవనగమనాన్ని గమ్యం చేరేవరకు సహనంగా సాగించాలి. ఏం సుధా! అమ్మ చెప్పిన మాటలు గుర్తుంటాయి కదూ!”

“అమ్మా! నన్ను క్షమించమ్మా! నీవు చెప్పిన మాటలు గుర్తున్నాయి కాని వాటిని ఆచరించే సహనం నాలో లేదు. ఆ బాటలో సుఖాలకు సంతోషించాను కాని కష్టాలను మాత్రం భరించలేకపోయాను” అనుకుంది సుధ బాధగా.

“ఎందుకిలా జరిగింది? కారణం ఎవరు? తప్పు తనదా? తలిదండ్రులు చెప్పినట్లు వినకుండా బయట ప్రపంచపు ఆకర్షణకు లొంగిపోయిన తన మనసుదా? పుట్టినదేశాన్ని వదిలి బ్రతుకుతెరువు కోసం విదేశాలకి వచ్చి అడుగడుగునా ఆంక్షలు విధించిన తన తలిదండ్రులదా? లేక తన మనసుని ఆకర్షించి పెళ్ళికొప్పించిన “స్టీవ్”దా? లేక అమ్మ అన్నట్లు “తన నొసట విధి లిఖించిన లిఖితమా?” సుధ మనసు గత జ్ఞాపకాలను తవ్వుకోసాగింది –

సుధకు దాదాపు మూడేళ్ళప్పుడు కాబోలు సుధ తలిదండ్రులు రామకృష్ణ, జయలక్ష్మి ఇండియా వదిలి ఇంగ్లండ్ వెళ్ళిపోయారు. దాదాపు అక్కడే స్థిరపడి పోయారు.

అయితే సుధ స్కూల్లో చేరినప్పటినుండి మొదలైనయి సమస్యలు. రోజులు గడిచిన కొద్దీ తన ఇంట్లో తీరు వేరని, బయటి ప్రపంచపు తీరు వేరని క్రమంగా అర్థం కాసాగింది సుధకు స్కూలు పిల్లలందరిలాగా కాకుండా సుధకు శాకాహారం ఇచ్చేవారు. సుధను ఇంటికి తీసుకువెళ్ళడానికి వచ్చిన జయలక్ష్మిని, ఆమె చీరను, బొట్టును

## డి స్కో

ఆశ్చర్యంగా, వింతగా చూసేవాళ్ళు పిల్లలంతా. సుధకూ వింతగానే ఉండేది అందరిలాగా తన తల్లి బాబ్ హేర్ చేసుకుని గౌన్ వేసుకోదని. ఒకరోజు తల్లిని అడగనే అడిగింది సుధ "ఎందుకమ్మా అలా బొట్టు పెట్టుకుని చీర కట్టుకుంటావ"ని. తాము హిందువుల మని, అసలు స్త్రీకి బొట్టు, కాటుక, చీర, గాజులు అందమని చెప్పిన తల్లి మాటలు సరిగా అర్థం కాలేదు సుధకు.

సుధ మిడిల్‌స్కూల్‌లో చేరిన కొత్తల్లో ఒకరోజు స్కూలు పిల్లలంతా సుధ పొడగాటి రెండు జడలను పట్టి లాగుతూ "యు ఆర్ ఫన్నీ" అని ఎగతాళి చేశారు. సుధ ఇంటికొచ్చి ఒకటే గొడవచేసింది, జడలు కత్తిరించి బాబ్డ్ హేర్ చేయమని కాని జయలక్ష్మి ఎంతకూ ఒప్పుకోలేదు పొడుగు జుట్టే అంద మని, వాళ కేమీ తెలియదని నచ్చచెప్పింది.

మిడిల్ స్కూల్ అయిపోయి హైస్కూల్‌లో చేరినప్పుడు మిడిల్‌స్కూల్‌లో పెద సెండాఫ్ పార్టీ ఇచ్చారు. ఆ రోజు స్కూల్ డెస్ కాకుండా ఎవరి కిష్టమైన బట్టలు వాళ్ళు వేసుకోవచ్చని చెప్పింది హెడ్ మిసెస్

జరీ అంచు కంచి పట్టు పరికిణీ, జాకెట్, చెవులకు లోలకులు, చేతులకు గాజులు, చిన్న బొట్టు, రెండు జడలు వేసుకున్న సుధను చూసి స్కూలు పిల్లలు వింతగా చూస్తూ "ఆర్ యు గోయింగ్ టు డు ఎనీ డ్రామా ఆర్ సమ్‌థింగ్' అని అడిగారు. మరి కొంతమంది "యు ఆర్ ఎ ఫన్నీ ఇండియన్ గర్ల్" అని ఎగతాళి చేశారు. అవన్నీ వింటున్న సుధను కన్నీళ్లతోనిలబడ్డ సుధను టీచర్ దగ్గరికి తీసుకుని "నీ డ్రెస్ చాలా అందంగా ఉంది సుధా! వాళ్ళకేమీ తెలియదు, వాళ్ళ మాటలు పట్టించుకోకు" అని ఊరడించింది.

ఆ సాయంత్రం సుధ ఇంటికి రాంగానే ఉక్రోషం పట్టలేక పెద్దగా ఏడుస్తూ గాజులు, లోలకులు తీసి విసిరికొట్టింది. జయలక్ష్మి ఎంత బతిమాలినా అన్నంతినకుండా అలిగి పడుకుంది. ఆరోజు మొదటిసారిగా అనుకుంది జయలక్ష్మి "తను సుధ పెంప కంలో ఏమైనా పొరపాటు చెయ్యటంలేదు కదా" అని.

ఆ రోజునుండే ప్రారంభమైంది సుధలో

# కార్యసాధన...




# సంతృప్తి

అద్భుతమైన రుచి
దానికదే సాటి
**సిజర్స్**
ఎప్పుడూ
సంతృప్తినిస్తుంది

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

గరిష్ఠ ధర:
రు. 1.20 కి 10 స్థానిక పన్నులు వసూలు

తను మత సాంప్రదాయాలపై నిరసన, బయట ప్రపంచంపై ఆకర్షణ క్రమంగా తల్లి మాట నిర్లక్ష్యం చేయటం ప్రారంభించింది.

ఆ సంవత్సరమే స్కూల్ ఫైనల్ అయిపోయి కాలేజీలో చేరింది సుధ అప్పటికి సుధకి పదిహేడేళ్ళు. కాలేజీకి ఇంటికి తప్ప ఒంటరిగా ఎక్కడికీ పోనిచ్చేవారు కారు సుధ తలిదండ్రులు. కాని ఫ్రెండ్స్ చెప్పే డిస్కో పార్టీలు, బాయ్ ఫ్రెండ్స్ డేటింగ్స్ గురించిన విషయాలు కుతూహలంగా వినేది సుధ.

ఒకరోజు సుధ ఫ్రెండ్ డరోతీ అడిగింది సుధను డిస్కో పార్టీకి రమ్మని. తనకు రావాలనే ఉంటుంది. కాని తన ఇంట్లో ఎక్కడికీ పోనివ్వరని బాధపడూ చెప్పింది సుధ.

"డిస్కో ఎంత బాగుంటుందో తెల్సా? ఒక్కసారైనా చూడు పనిదరం మీ ఇంటికి వెళ్ళి మా ఇంట్లో చదువుకుంటామని చెప్తాం. మీ అమ్మ అలా చెప్తే పంపిస్తుందనుకుంటాను" అంది డరోతీ.

డరోతి కూడా పదేపదే అడగటంతో ఒప్పుకుంది జయలక్ష్మి త్వరగా ఇంటికి రమ్మని ఎన్ని జాగ్రత్తలు చెప్పి పంపింది సుధను. డిస్కో ఎంత బాగుంటుందో డరోతి చెప్తుంటే కుతూహలంగా వింది సుధ. కాని ఒక్కసారిగా భయమేసింది, తల్లితో అబద్ధాలు చెప్పినందుకు మధ్య దారిలో అడిగింది డరోతి "ఇలాగే వస్తావా?" అని. "మరి మా యింట్లో వేరే బట్టలేసుకోనివ్వరు. నాకు లేవు కూడా" అంది సుధ. తన స్కర్ట్, లూజుగా ఉండే బ్లౌజ్, కార్డిగన్ వైపు చూసుకుంటూ "నా బట్టలిస్తాను వేసుకో" అంది డరోతి.

డరోతి ఇంట్లో అద్దంలో చూసుకున్న సుధ తనేనా అని ఆశ్చర్యపోయింది. వైట్ బాగీ జీన్స్, పైన పింక్ కలర్ వి నెక్ ఫుల్ స్లీవ్ జంపర్, గులాబి రంగు క్రీమ్ రాచుకున్న బుగ్గలు, లిప్‌స్టిక్ వేసుకున్న పెదవులు, కనురెప్పలకు నల్లని మస్కారా, కళ్ళకూ కనుబొమలకూ మధ్యన లైట్ గ్రీనిష్ బ్లూ కలర్ పెయింట్ జుట్టంతా పైకి దువ్వి 'పోనీ టెయిల్.'

ఆరోజు 'డిస్కో'లో కడుగుపెట్టిన సుధ మనసు ఎన్నడూ ఎరుగని ఆనందంతో, తెలియని భయంతో ఒక్క క్షణం జలద

## డిస్కో

రించింది అందరూ ఏవేవో డ్రింక్స్ తాగుతున్నారు. తనకు డరోతీ "కోక్" తెచ్చిచ్చింది మెల్లగా కోక్ సిప్ చేస్తూ ఓ టేబుల్ వద్ద కూర్చుంది కబుర్లతో, నవ్వులతో, జిగేలుమనే లైట్లతో హాలంతా కోలాహలంగా చైతన్యవంతంగా ఉంది. ఉన్నట్టుండి మ్యూజిక్ తారస్థాయి నందుకుంది. కళ్ళు మిరుమిట్లు గొలిపే లైట్లన్నీ ఆరిపోయి, డిమ్‌గా రంగు రంగుల లైట్లు వెలుగుతూ ఆరుతూ హాలంతా ఇంద్రధనుస్సులాంటి రంగులతో నిండి వింత అందంతో మెరిసిపోతోంది ఆడ, మగ జంటలు జంటలుగా మ్యూజిక్ అనుగుణంగా స్టెప్స్‌వేస్తూ

---

### విశాఖపట్నం ఉక్కు కర్మాగారం పని

సోవియట్ సహకారంతో భారతదేశంలో నిర్మితమవుతున్న మూడవ ఉక్కు కర్మాగారం పని విశాఖపట్నంలో చురుగ్గా సాగుతోంది. మొత్తం 21 మిలియన్ ఘనమీటర్ల మట్టి పనిలో 16.5 మిలియన్ ఘనమీటర్ల పని అంటే 81 శాతం జరిగిందని టాస్ విలేఖరి సమాచారం. 20 వేలకు పైగా కార్మికులు యీ పనిలో నిమగ్నమై వున్నారు. భారతదేశ 6వ పంచవర్ష ప్రణాళిక(1980–1985) అంతానికి యీ కర్మాగారం ఉత్పత్తి ప్రారంభిస్తుంది. దాని తొలి దశ ఉత్పత్తి యేటా 12 లక్షల టన్నులుంటుంది.

---

డాన్స్ ఆరంభించారు. సుధ మాత్రం అదంతా వింతగా చూస్తూ అలాగే కూర్చుంది.

అలా మొదలయింది సుధ ఇంట్లో అబద్ధాలు చెప్పి 'డిస్కో' పార్టీలకు వెళ్ళడం. మెల్లి మెల్లిగా డరోతి ప్రోత్సాహంతోసుధకూడా డాన్స్ చెయ్యటం ప్రారంభించింది. మొదట్లో స్టెప్స్ ఎలా వెయ్యాలో తెలియక, సిగ్గుతో ఎక్కువసేపు చెయ్యలేకపోయేది. కొన్నిసార్లు ఇంట్లోచెప్పిన అబద్ధాలు గుర్తొచ్చి మనసంతా అదోలా అయ్యేది.

ఒకరోజు డరోతి డిస్కోలో జిమ్‌ను పరిచయం చేసింది తన బాయ్ ఫ్రెండ్ అని. ఆరోజునుండి డరోతి సుధతో డాన్స్ మానేసి జిమ్‌తో చెయ్యటం ప్రారంభించింది. సుధ తోడు ఎవరూ లేక ఊరికే కూర్చుని చూస్తుండేది. అప్పుడప్పుడూ ఎవరో అబ్బాయిలు వచ్చి డాన్స్‌కు పిలిచేవారు. కాని తను వెళ్ళలేకపోయింది. ఒకసారి ఒంటరిగా కూర్చుని డిస్కో చూస్తున్న సుధ వదకు "స్టీవ్" వచ్చి డాన్స్‌కు రమ్మన్నాడు. అతడి కళ్ళలో, మాటల్లో ఏం చూసిందో కాని సుధ కాదని అనలేకపోయింది మొదటిసారిగా ఆ రోజు డరోతీ కాకుండా "స్టీవ్"తో డాన్స్ చేసింది. ఇంటికి వచ్చిన సుధ ఏదో తప్పు చేశాననే భావనతో కుంచించుకుపోయింది. ఇక డిస్కోలకు వెళ్ళకూడదనుకుంది కాని సుధ మనసు ఎంతవద్దన్నా సుధ చెప్పిన మాట వినడం లేదు. మళ్ళీ స్టీవ్ ఎక్కడైనా కన్పిస్తే బాగుండుననే కోరిక అంతరాంతరాళలో ఒక్క క్షణం మెరిసి మాయమయ్యేది.

ఆరోజు కాలేజీ క్యాంటీన్‌లోకి వెళబోతున్న సుధ "హాయ్ సుధా!" అన్న మాటలకు గిరుక్కున వెనక్కి తిరిగింది ఎదురుగా చిరునవ్వుతో స్టీవ్. సుధ పిలవకుండానే సుధతో పాటు కాంటీన్‌లోకొచ్చి కూర్చున్నాడు స్టీవ్. తనే అయిస్‌క్రీమ్ తెప్పించాడు సుధకేం మాట్లాడాలో తెలియడంలేదు. ఇతనితో పరిచయం పెంచుకోవాలా? వద్దా? అనే మీమాంసలో పడింది. స్టీవ్ అడిగాడు "డిస్కోకు రావడం లేదేమ"ని సుధ సమాధానం కోసం ఎదురు చూడకుండానే "సుధా! నీవు రాకుంటే నేను ఎవరితోనూ డాన్స్ చెయ్యడం లేదు తెల్సా? ఇన్ని రోజులు నీవెక్కడ కన్పిస్తావా? అని ఊరంతా వెతికాను తెల్సా? ఈ రోజు అనుకోకుండా ఇక్కడే కలిశావు. సుధా! మంచిదానివి కదూ! మరి నాకోసం ఈ రోజు డిస్కోకు వస్తావుకదూ!" మంత్రముగ్ధలా స్టీవ్ మాటలన్నీ మౌనంగా విన్న సుధ అనాలోచితంగా అంగీకారంతెల్పింది. ఆ రోజు నుండి సుధ మనసు చిత్రమైన అనుభూతికి లోనైంది. ఆ రోజు సుధ అంగీకారం పెళ్ళి వరకూ దారితీసింది.

స్టీవ్ అదే కాలేజీలో జాబ్ సంపాదించాడు. సుధను పెళ్ళికోసం ఒత్తిడి చేయసాగాడు ఆ రోజు స్టీవ్ విషయం ఇంట్లో చెప్పటానికి నిశ్చయించుకుంది సుధ. విషయం విన్న జయలక్ష్మి ఆ పెళ్ళి వద్దని సుధకు ఎన్నో విధాల నచ్చచెప్పింది. కాని సుధ ఒప్పుకోలేదు చివరకు రామకృష్ణ అన్నాడు– "సుధా! నీవు నిర్ణయించుకున్న నిర్ణయం సరైనదేనని

'వు జీవితంలో సర్దుకుపోతావనే నమ్మకంతో వ్పకుంటున్నాము. మరి నా నమ్మకాన్ని మ్ముచేయవు కదూ!'' అని

పెళ్ళయిన తర్వాత స్టీవ్‌తో సుధ గురించి ప్పా. కళ్ళనీళ్ళతో సుధకు వీడ్కోలు చెప్పిన జయలక్ష్మిని చూసి ''పిచ్చి అమ్మ'' అని నవ్వుకుంది సుధ.

స్టీవ్‌తో క్రొత్త ఇంట్లో అడుగు పెట్టిన సుధ తనొక స్వర్గంలో అడుగు పెట్టాననుకుంది. స్టీవ్ సాహచర్యంలో కాలం అతిత్వరగా గడిచిపోయింది. సుధకోసం మాంసాహారం తినడం, ఆల్కహాల్ త్రాగడం మానేశాడు స్టీవ్.

ఒక ఆదివారం పెళ్ళైన చాలా రోజులకు మొదటిసారిగా డిస్కోకు వెళ్ళారు సుధ, స్టీవ్. కాసేపు సుధతో డాన్స్ చేసిన స్టీవ్, మరో అమ్మాయి చేయి అందించగానే సుధను వదిలేసి ఆమెతో డాన్స్ చేయసాగాడు. ఆ అనుకోని సంఘటనకు సుధ నిశ్చేష్టురాలైపోయింది. ఆ క్షణం నుండే ప్రారంభమైంది సుధ మనసులో తుఫాను. స్టీవ్ ఇలా చేస్తాడని కలలో కూడా అనుకోలేదు. అవమానంతో, బాధతో స్టీవ్‌తో ఒక్కమాటైనా చెప్పకుండా ఇంటి కొచ్చేసింది సుధ. శూన్యమైన మనసుతో దుఃఖం కూడా రాలేదు సుధకు. కాని రాత్రి 12గం. కు ఇంటికొచ్చిన స్టీవ్‌ను చూడగానే తను పడిన మానసిక బాధ అంతా కన్నీళ్ళరూపంలో బయటికొచ్చేసింది. స్టీవ్ ఎన్నివిధాల అనునయించినా సుధ మనసు కుదుటపడలేదు. ''సుధా! నీవంటె నాకెంత ప్రేమో నీకు తెల్సు. నా మనసంతా నీవే ఉన్నావు సుధా! డిస్కోలో ఎవరితో డాన్స్ చేసినా తప్పులేదు. చేయి అందించినప్పుడు డాన్స్ చెయ్యకపోతే అవమానించినట్లు బాధపడ్తారు. ఒకవేళ నీవు వేరే అతనితో డాన్స్ చేసినా నేనేమీ అనుకోను. కేవలం పార్టీలో డాన్స్ చేయడం ఒక ఆచారం లాంటిది'' స్టీవ్ ఎంత చెప్పినా సుధలో అవమానపు దుఃఖం తీరలేదు.

హుం. ఎలా అన్నాడు తను వేరేవాళ్ళతో డాన్స్ చేసినా ఏమీ అనుకోడట. ఛీ! తను కనీసం అలాంటి ఊహ కూడా సహించలేదు. తన వేషధారణ, జీవనవిధానం వింత పాశ్చాత్యులను అనుకరించినా తన మనసు మాత్రం మారలేదు. స్టీవ్‌ను తప్ప వేరే వాళ్ళను కన్నెత్తి కూడా చూడలేదు.

ఒక సాయంత్రం స్టీవ్‌కు తెలిసినవాళ్ళు డామినిక్, టీనా టీకి పిలిస్తే వెళ్ళారు. వెళ్ళంగానే ''టీనా''ను విష్ చేస్తూ టీనా బుగ్గపై ముద్దు పెట్టుకున్నాడు స్టీవ్. వచ్చేటప్పుడూ అంతే మళ్ళీ టీనా బుగ్గపై ముద్దు పెట్టుకున్నాడు స్టీవ్. సుధ మనసులో మానుతున్న గాయాన్ని రేపినట్లయింది. సుధ మాత్రం డామినిక్‌కు షేక్‌హాండ్ ఇచ్చింది. సుధ తీరు చూసి డామినిక్ అంతకన్నా సాహసించలేక పోయాడు.

ఆ రోజే చెప్పింది సుధ. ఈ ముద్దులు డాన్స్‌లు తన కిష్టంలేదని, అవన్నీ మానేయమని. ''ఇలా విష్ చేసినప్పుడు ముద్దు పెట్టుకోవడం, పార్టీలో డాన్స్ చెయ్యడం, ఇవన్నీ మాదేశపు సాంప్రదాయాలు, ఆచారాలు నీవు హిందువుల పిల్లవు కాబట్టి నీకివన్నీ తెలియవని, అలవాటు లేదని ఎవరూ ఏమనుకోరు. కాని నేను అలా విష్ చేయకుంటే వాళ్ళు అవమానించినట్లు భావిస్తారు. చూడు సుధా! జీవితంలో నిన్ను తప్ప మరెవ్వరినీ ప్రేమించలేదు నేను. నీ కోసం మాంసాహారం, సారా త్రాగడం మానేశాను. కానీ నీవు నాకోసం కొన్ని కొన్ని కనీసపు సాంఘికాచారాలను కూడా భరించలేకపోతున్నావు. సాంఘికంగా జీవించాలంటే నీకు ఎలా వున్నా నాకు మాత్రం ఇవన్నీ తప్పవు,'' కాస్త కఠినంగా, కాస్త అనునయంగా చెప్పాడు స్టీవ్.

కాని ఎంత చెప్పినా రోజు రోజుకూ సుధ మనసు వికలమైపోతూంది. స్టీవ్ ప్రతి కదలికా భూతద్దంలోంచి చూసి సాధించసాగింది. సుధ సాధింపు ఎక్కువైన కొద్దీ స్టీవ్‌లో నిర్లక్ష్యం ఎక్కువ కాసాగింది.

ఒకరోజు సుధకు చెప్పకుండా డిస్కోకు వెళ్ళి బాగా త్రాగివచ్చిన స్టీవ్‌ను క్షమించలేక పోయింది సుధ.

ఉదయమే తలుపు తట్టిన సుధను చూసి రామకృష్ణ దంపతులు ఆశ్చర్యపోయారు. సుధ చెప్పిన విషయాలన్నీ విన్న జయలక్ష్మి అడిగింది సుధను ఇప్పుడేం చేయదల్చుకున్నావని.

''అమ్మా! నేనాజీవితంలో ఇమడలేకపోతున్నాను. స్టీవ్‌తో కలిసి ఇక జీవించలేను. మీ దగ్గరే ఉండిపోతానమ్మా!'' అంది సుధ.

''సుధా! నీవు కోరికోరి స్టీవ్‌ను పెళ్ళి చేసుకున్నావు. దాదాపు పదిహేనేళ్ళు ఈ దేశంలో పెరిగిన నీకు ఇక్కడి ఆచార వ్యవహారాలన్నీ తెలుసు. అలాంటప్పుడు పెళ్ళికిముందే ఇవన్నీ ఎందుకాలోచించలేదు? నీ కోసం అతడు కొన్ని అలవాట్లు మార్చుకున్నాడు. మరి అతడు మార్చుకోలేని సాంఘికాచారాలకు నీవు సర్దుకుపోవడం నేర్చుకోలేదు. ఇప్పటికైనా వెళ్ళి ఇకముందు నుండీ అతడితో కలిసి జీవించడం నేర్చుకో. ఇక్కడమాత్రం నీవుండటం మంచిది కాదు'' అంది జయలక్ష్మి.

''అమ్మా నన్నేదో ఓదార్చి నాకింత మనశ్శాంతి కల్గిస్తావనుకున్నానమ్మా కాని అక్కడికే వెళ్ళమను''

ఆలోచనలో మునిగి కళ్ళు మూసుకున్న సుధ ''పద సుధా ఇంటికెళ్దాం'' ఆ మాటలకు ఉలిక్కిపడి కళ్ళు తెరిచింది. ఎదురుగా స్టీవ్, ''పద సుధా ఇంటికెళ్దాం: నీ అలవాట్లకు నేనూ, నా అలవాటకు నీవూ సర్దుకుపోతూ కలిసి జీవించడం నేర్చుకుందాం'' అన్నాడు స్టీవ్ సుధ చేయి పట్టుకుని నడిపిస్తూ.






రాజారావు ఇంటికి వచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలు కావస్తోంది. అతను రోజూ ఆఫీసు వదలగానే ఇంటికి రాడు. ఏ స్నేహితుడి ఇంటికో వెళ్లి కారమ్సో, పేకాటో (డబ్బులు పెట్టి కాదు) ఆడి ఎనిమిది గంటల వేళకు ఇల్లు చేరుకుంటాడు.

అతను ఇంట్లో అడుగు పెట్టేసరికి వాలుకుర్చీలో పడుకుని రాజారావు భార్య రాజేశ్వరి ఏదో నవల చదువుకుంటున్నది. ముగ్గురు పిల్లలు ఏదో బొమ్మ గురించి తగాదా పడుతున్నారు.

"చదువుకున్నారా" అడిగాడు రాజారావు పిల్లల్ని.

"మీ కోసమే చూస్తున్నాం. మాకు అర్థంకాని పాఠాలు చెప్పాలి మీరు" అన్నారు అందులో ఇద్దరు — పెద్ద ఆడపిల్ల — రెండో వాడు.

"మీ అమ్మనడిగి చెప్పించుకోగూడదా ?" కోపంగా అడిగాడు రాజారావు లుంగీ కట్టుకుంటూ.

"అమ్మ చెప్పనన్నది" మూడో వాడు చెప్పాడు.

రాజేశ్వరి నవల చదవటం ఆపకపోయేసరికి రాజారావు పెద్దగా "ఏమండోయ్" అన్నాడు.

"ఏమిటా కేకలు ?" అన్నది రాజేశ్వరి విసుగ్గా మొహం పెట్టి.

"నేనొచ్చి అరగంటయ్యింది ?" అన్నాడు.

"అయితే ఏమంటారు ? కాళ్లు కడుక్కుని రండి, భోజనం వడ్డిస్తాను" అన్నది మళ్లీ నవల చదువుతూ.

రాజారావుకు రాజేశ్వరి చేతిలో వున్న ఆ నవలను లాగి పారెయ్యాలనిపించింది. కాని అతనలా చెయ్యలేకపోయాడు. అతనికి తెలుసు భార్యకు నవలలంటే ఎంత పిచ్చో. ఆమెకు నవలలు వుంటే ఏమీ అవసరం లేదు. ఒక్కోసారి భోజనం చేస్తూ కూడా నవల చదువుతుంది, బాగా ఇంటరెస్టింగ్‌గా వుంటే. నవలల కోసం ఆమె నెలకు పది రూపాయలు ఖర్చు పెడుతుంది. పది రూపాయలు చెల్లిస్తే, ఏదో బుక్‌షాప్ వాళ్ళు రోజుకు రెండు నవలలు ఇచ్చి వెళతారు చదవటానికి...

భోజనాలయ్యేసరికి రాజారావుకు, తను ఆ రాత్రి రెండో ఆట సినిమాకు వెళ్ళాలను కున్న విషయం గుర్తుకు వచ్చింది.

అతను మళ్లీ ప్యాంటు వేసుకుంటూ "నువ్వు ఎంతవరకు చదువుకున్నావ్ రాజేశ్వరి" అని అడిగాడు భార్యని.

"ఎందుకని?" అన్నది వంటిల్లు సర్ది వచ్చి మళ్లీ నవలను అందుకుంటూ...

"ఎందుకో చెబుతాను ముందు నువ్వు చెప్పు" అన్నాడు తను కుర్చీలో కూర్చుని.

"ఇంటర్ పాసయిన విషయం మీకు తెలియదా?" అని అడిగింది.

"ఇంటర్ చదివిన దానివి ముగ్గురు చిన్న పిల్లలకు చదువు చెప్పలేవా రాత్రి పూట ఒక గంటసేపు?" అని అడిగాడు.

"ఇందుకా మీరు అడిగింది? మీ ఉద్దేశ్యం అర్థమయ్యింది. నన్ను ఈ నవలలు చదవకుండా చెయ్యాలనేకదా మీ ఆలోచన. నేను మీకు ఎన్నోసార్లు చెప్పాను. పిల్లలకు ట్యూషన్ పెట్టించమని. బళ్లో వీళ్ళకు చదువు చెప్పరు. ఇంటి దగ్గర వీళ్ళు చదవలేరు. అందుకే ట్యూషన్ పెట్టించమంటే మీరు నన్ను చదువు చెప్పమంటున్నారు. ఎందుకు? వీళ్ళ ముగ్గురికీ ట్యూషన్ పెట్టిస్తే మూడు పదులు ముప్పయ్ రూపాయలు ఖర్చవుతాయనేగా?" అన్నది.

"అవును రాజేశ్వరీ నువ్వన్నది ముమ్మాటికీ నిజం. మన ఆదాయాన్ననుసరించి మనం ఖర్చు పెట్టాలి. నాకొచ్చే జీతంలో కొంత నాన్నకు పంపుతున్నాను. కొంత పిల్లల కోసం బ్యాంకులో వేస్తున్నాను. మిగిలినది మన కోసం ఖర్చు పెడుతున్నాను. నువ్వు చదువు రానిదానివయితే నేను తప్పకుండా పిల్లలకు ట్యూషన్ పెట్టించేవాడినే. ఎందుకంటే వాళ్ళ భవిష్యత్తు ముఖ్యం కాబట్టి. కాని నువ్వు చదువుకున్న దానివి. ఆ లెక్కకొస్తే నేనూ చదువుకున్న వాడినే! అయితే నేను బయట తిరిగే మగవాడిని. వాళ్ళకు రోజూ ఒక టైముకు చదువుచెప్పే అవకాశం నాకు తక్కువ. అంతేకాదు. వాళ్ళకు నీ దగ్గరకంటే నా దగ్గర చనువు తక్కువ. అందువల రోజూ రాత్రిపూట ఒక గంట, లేకపోతే నీకు

తీరిక దొరికినప్పుడు నువ్వు చెప్పగలిగినంత వరకు పిల్లలకు చదువు చెప్పవచ్చు. ఇందుకు మనం ముప్పయి రూపాయలు ఖర్చు చెయ్యవలసిన అగత్యంలేదు. ఆ డబ్బుతో మనం ఇంకో అవసరం తీర్చుకోవచ్చు.''

మధ్యలోనే అందుకున్నది రాజేశ్వరి—

''ఆపండి మీ ఉపన్యాసం మీరివన్నీ ఎందుకు చెబుతున్నారో నాకు తెలుసు. నేను పతినెలా పదిరూపాయలు ఈ నవలల కోసం ఖర్చుచేస్తున్నాననే కదూ.''

''కాదు రాజేశ్వరీ...ప్లీజ్.నన్నర్థంచేసుకో. నవలలు చదవొద్దని నేను అనటంలేదు. చదువుకో, కాని పిల్లలకు చదువు కూడా చెప్పు, ఓ గంట. నవల చదవటం ఆపి ... కొంత టైము పిల్లల చదువుకోసం వినియోగించమని చెబుతున్నాను. నీ పిల్లలకు నువ్వు చదువు చెప్పుకోలేనప్పుడు ఇక నీ చదువుకు పయోజనం ఏముంది ? ఒక దీపం మరికొన్నింటిని వెలిగించేదిగా వుండాలి... నువ్వే ఆలోచించుకో. మన పిల్లల భవిష్యత్తు కొంతవరకు మన చేతుల్లోనే వుంది...'' అని బయటకు వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వెంటనే నవల చదవలేక పోయింది రాజేశ్వరి తన వైపే చూస్తున్న ముగ్గురు పిల్లల్నీ చూసింది.

*　　　*　　　*

ఆ మరురోజు రాత్రి రాజారావు ఇంటికి వచ్చేసరికి ఎనిమిది గంటలు దాటింది. అయితే ఎప్పటిలా పిల్లలు తగాదా పడడటంలేదు. రాజేశ్వరి వాలుకుర్చీలో పడుకుని నవల చదవటంలేదు.

పిల్లల మధ్య కూర్చుని పాఠాలు చెబుతోంది.

భర్త అడుగుల చప్పుడు విని తలెత్తి చూసింది.

''థాంక్స్ రాజేశ్వరి ! నీ మనసు మార్చు కున్నందుకు. నీలో ఇంత త్వరగా మార్పు వస్తుందనుకోలేదు'' అన్నాడు సంతోషంగా.

''మీరలా అనుకుని సంతోషపడుతున్నారేమో ... మీ మాటలతో నాలో మార్పు రాలేదు అసలు ఇప్పుడు నేను మీ భార్యని కాదు, ఈ పిల్లలకు తల్లిని కాదు. మీ పిల్లలకు ట్యూషన్ టీచర్ని...పిళ్ళ ట్యూషన్‌కి ఇయ్యే ముప్పయి రూపాయలూ మీరు నాకు ఇవ్వాలి.'' అన్నది రాజేశ్వరి మెరుస్తున్న కళ్ళతో గర్వంగా.

**ప్రముఖుల జీవితాల ప్రచారం !**

తమిళనాడు ప్రభుత్వం దృశ్య శ్రవ్య పరికరాలతో వ్యయంగా ప్రముఖుల జీవితాలను, వాడవాడలో ప్రదర్శిస్తున్నది. ఆ విధంగానే మన రాష్ట్రం కూడ ఒక పథకాన్ని నిర్మించింది. ఈ పథకం ప్రకారం వివిధ రంగాల ప్రముఖుల జీవితాలను, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలను రాష్ట్రంలోని మారుమూల ప్రాంతాల ప్రజలకు తెలియచేస్తారు. ఈ పరికరాలకు దాదాపు ఆరులక్షలరూపాయలు వ్యయమవుతుంది. త్యాగయ్య, వేమన్నవంటివారి జీవిత చరిత్రలేగాక, మహా నాయకుల జీవితాలను కూడ ప్రసారం చేస్తారు. దీనివల్ల ప్రజలకు రాష్ట్ర వైభవం తెలుస్తుంది. వారు ఉత్సాహం కలుగుతుంది. ఈ విషయాన్ని రాష్ట్ర సాంస్కృతిక శాఖ డైరెక్టర్ శ్రీ జి. వి. సోమయాజులు తెలియజేశారు మే 20 వ తేదీన.

**శ్రీ విజయ శిఖామణి సూచన :**

ప్రస్తుత రాష్ట్ర మంత్రివర్గంలో రాయలసీమవారికి ముఖ్యశాఖ ఏదీలేదు గనుక రాయలసీమకు చెందిన సీనియర్ నాయకునికి ఆర్థిక శాఖను కేటాయించాలని విధాన సభ మాజీ సభ్యుడు శ్రీ విజయ శిఖామణి మే 28 న ముఖ్యమంత్రి శ్రీ అంజయ్యకు విజ్ఞప్తి చేశారు. శ్రీ జి. రాజారాం మరణానంతరం ఆర్థిక శాఖ

## హైదరాబాదు నోట్‌బుక్

ఎవరికీ కేటాయించబడకపోవడం అందరికీ విదితమే. ముఖ్యమంత్రి పదవితోపాటు రెవెన్యూ, హోం, భారీ పరిశ్రమలు, నీటి పారుదల, వ్యవసాయంవంటి ముఖ్య శాఖలన్నీ తెలంగాణా ఆంధ్ర ప్రాంతాలకే దక్కాయని, రాయలసీమ ప్రాంతం వారికి ఒక్క ముఖ్యమైన శాఖయినా లేదని ఆయన అన్నారు. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి మరణానంతరం ఉప ముఖ్య పదవిని రద్దు చేశారని, ఉభయ ప్రాంతాల మధ్య రాజకీయ సంతులనంకోసం ఆ పదవిని పునరుద్ధరించాలని ఆయన కోరారు. రాష్ట్రంలోని మూడు ప్రాంతాలకు తగు రీతిగా శాఖలను పునర్విభజన చేయాలని శ్రీ విజయ శిఖామణి సూచించారు.

**జైల్ భరో ఉద్యమం :**

దేశంలో వివిధ వస్తువుల ధరలు పెరుగుతున్నందుకు నిరసనగా మే 25 న దేశవ్యాప్తంగా సత్యాగ్రహం జరుపాలని, జైల్ భరో (జెయిళ్లను నింపండి) ఉద్యమం నిర్వహించాలని భారతీయ జనతా పార్టీ ఇటీవల కొచ్చిన్‌లో ఆదేశించిన మేరకు జరిగిన జైల్‌భరో ఉద్యమంలో భాగంగా సచివాలయం వద్ద మే 25 ఉదయం భారతీయ జనతా పార్టీ కార్యకర్తలు ధర్నా జరిపారు. పోలీసులు ఈ సందర్భంలో వందమందిని అరెస్టు చేశారు. అరెస్టయిన వారిలో భారతీయ జనతా పార్టీ నగర విభాగం అధ్యక్షురాలు శ్రీమతి కుముద్‌నాయక్, కేంద్ర పార్టీ కార్యదర్శి శ్రీ జనకృష్ణమూర్తి, విధాన పరిషత్తు సభ్యులు శ్రీ వి. రామారావు ఉన్నారు.

**ఉ ప శ్రు తి :**

ఏం సార్! తెగ గాలించేస్తున్నారు రత్న విశేషమంతా?— అనడిగాను ద్వితీయ ప్రపంచ మహాసభకు వచ్చి సింగపూర్ వీధులలో హడావిడిగా తిరుగుతున్న ఒక ఆంధ్ర నాయకుణ్ని. మేలు జాతి వజ్రం కోసం వెదుకుతున్నాను. దానిని ధరిస్తే పై పదవులు వస్తాయని గురువుగారన్నారు అన్నాడు ఆ నాయకుడు. కాళిదాసు అదే అన్నాడు సార్, రత్నాన్ని మనం వెదకాలి కాని, రత్నం మనని వెదుక్కుంటూ రాదు— అని ప్రక్కన ఉన్న ఒకరు చలోక్తి విసిరారు. వాహ్! లచ్చనంగాఉంది ఏ మాట! అయ్యగారి చేతుల్లో ఆ వజ్రానికే అందం— అన్నాడు మా మాటలు వింటున్న ఒక శిష్యవర్గారు.

— తిరుమల రామచంద్ర

# ప్రధానమంత్రి 20 అంశాల కార్యక్రమం
# లక్షలాది కష్టజీవులకు వరప్రసాదం



ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటించిన 20 అంశాల ఆర్థిక కార్యక్రమం, వాస్తవానికి ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి, సుస్థిరమైన ప్రగతికి సంకేతం. ఇది బడుగు వర్గాల అభివృద్ధికి జరుపుతున్న కృషిలో నూతన అధ్యాయాన్ని ప్రారంభించి లక్షలాది మంది బలహీనవర్గాల ప్రజలలో కొత్త ఆశలను చిగురింపజేసింది.



వాస్తవాలే ఇందుకు దర్పణం.

శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

### రికార్డు స్థాయిలో ఆహారోత్పత్తి:

1978-79 లో రికార్డుస్థాయిలో 106.6 లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఉత్పత్తి చేశారు. తుఫాను, దుర్భిక్ష పరిస్థితులు ఏర్పడినప్పటికీ తాత్కాలిక ప్రణాళికలను త్వరితగతిని అమలు జరపడంతో 79 - 80 లో కనీసం 70 లక్షల టన్నుల మేరకు ఉత్పత్తి సాధించగలిగారు.

### ప్రజలకు చౌక వస్త్రాలు :

అరవై శాతం మంది చేనేత పనివారలను సహకార పరిధిలోకి తెచ్చా
1977-78 లో 189 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేయగా 1978 79లో 2 3 లక్షలు 1979-80లో 330 లక్షల చదరపు మీటర్ల చౌక వస్త్రాలను ఉత్పత్తి చేసి ఇప్పుడు 3818 కేంద్రాల ద్వారా ప్రజలకు పంపిణీ చేశారు.

### చౌకధర దుకాణాల ద్వారా అత్యవసర సరుకులు :

ఇప్పుడు 22,009 చౌకధర దుకాణాల ద్వారా ప్రజలకు అత్యవసర సరుకులను సరఫరా చేస్తున్నారు.

### భూ సంస్కరణలు :

రాష్ట్రంలో భూ సంస్కరణలను తీవ్రతరంగా అమలు జరుపుతున్నారు. ఇందువల్ల 3.79 లక్షల ఎకరాల మిగులు భూమిని స్వాధీనం చేసుకున్నారు. 1,74,125 కుటుంబాలకు భూమి పంపిణీ చేశారు. వారిలో చాలా వరకు షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులవారు ఉన్నారు.

### బలహీన వర్గాలకు ఇళ్లు :

ఈ పథకాన్ని ద్విగుణీకృతోత్సాహంతో అమలు జరుపుతున్నారు. 2.5 లక్షల కుటుంబాలకు 5,000 కొత్తవాడలో వసతి కల్పించారు. 12 లక్షల పేద కుటుంబాలకు ఇళ్ల స్థలాలు కేటాయించారు.

డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

**D.I.P.R No. 23126/Advt/Cl-3/81**

# ★ వారఫలం ★

**10-7-1981 శుక్రవారం మొదలు**
**16-7-1981 గురువారం వరకు**

మేషం : శ్రమాధిక్యతగల వారమైనను అన్ని రంగాలలో సుగుణం కనిపిస్తుంది. సోదరుల విషయంగా, ఏదో శ్రమకు గురి కావలసిన దినాలు. వ్యాపారాభివృద్ధికి చేసిన ప్రయత్నాలు ఫలవంతం కానున్నవి. స్త్రీలకు: నూతన ప్రయత్నాలు ఫలానికి రావడం, శుభ వార్తా శ్రవణమున్నది.

వృషభం: నాలుగు విధాలా మేలు పొందనున్నారు. ఉద్యోగ, వృత్తులందు ఆదరణ సంప్రాప్తించనున్నది. కుటుంబ సభ్యులకు సహాయం చేయవలసిన పరిస్థితులుండగలవు. మీ తాలూకు వస్తువులు పోయే మార్గమున్నది, జాగ్రత్త! స్త్రీలకు: చేసిన కృషి విఫలం గావడం, సమయానికి ధనం అందక పోవడం గమనింపగలరు.

మిథునం: ఆరోగ్యం కుదుటపడలేదనే ఆందోళన, అందవలసిన డబ్బు సమయానికి అందలేదనే చింత, చేసిన ప్రయత్నాలు ఉద్యోగ వృత్తులందు, విఫలమౌనవనే బాధ, గమనింపగలరు. స్త్రీలకు: యత్న కార్య విఫలం, రాజకీయంగా అనుకూలత లేకపోవడం, ఉద్యోగ వృత్తులందు ప్రోత్సాహం కనిపించకపోవటం గమనింపగలరు.

కర్కాటకం : ఆశించిన ఫలితాలు అందుకొంటారు. ఉద్యోగ వృత్తులందు అనుకూలతగలదు. నూతన విషయాలు ఎన్నో గ్రహించనున్నారు. మిత్రులు సహకరించనున్నారు కూడా. రచనా విధానంలో, వైద్య వృత్తిలో, నటనలో ప్రావీణ్యత గల వారికి కావలసినన్ని అవకాశాలుండగలవు. స్త్రీలకు: కృషి ఫలించడం, ఉద్యోగంలో ఒక మెట్టు నెక్కే మార్గం కనిపించగలదు.

సింహం: ఆరోగ్య విషయంలో జాగ్రత్త వహించదగిన వారం. అవకాశాలను సద్వినియోగం చేసికోవలసిన వారం. ముఖ్య బంధువులకో, ఆప్తులకో సహాయపడటం, ధనం వెచ్చించడం కూడా సంభవమే. వ్యాపారానికి మాత్రం లోపం రాదు, యథాతథంగా వచ్చే రాబడికి లోపం రాదు. స్త్రీలకు: వివాహ వయస్సు వచ్చిన బాలికలకు శుభ కార్య ప్రస్తావనలుండటం, ఉన్నతపదవులు లభ్యం కావడానికి అవకాశం గల వారం.

కన్య: వారమంతా ఇబ్బందులతో గడిచి పోతున్నది. స్థల మార్పు కొందరి విషయంలో సంభవం. కుటుంబపరిస్థితులు మిమ్మల్నెన్నో బాగా కలవర పరచనున్నవి. గతంలో చేసిన పొరపాట్ల మూలాన ఇబ్బందులు తటస్థించనున్నవి. సంతాన విషయంలో ఎంతో జాగ్రత్త పడాలి. స్త్రీలకు: ఆదాయ లోపం, ఉద్యోగ వృత్తులందు ప్రగతి చెప్పదగిన అంశం.

తుల: దూర ప్రయాణాలు చేయనున్నారు. శుభ వార్తా శ్రవణ సంతరం, తాపత్రయపడటం, ధనానికి ప్రయత్నించడం, వ్యాపారానుకూలత సిద్ధించడం, ఉద్యోగంలో పోయిన అవకాశాలు లభించడం, కొందరకు నూతనంగా వృత్తి విషయకంగా చేసిన ప్రయత్నాలు ఫలితానికి రావటం గమనించగలరు. స్త్రీలకు: అవసరాలకు డబ్బు అందడం, క్రీడావనిలో అవకాశాలుండటం గమనింపగలరు.

వృశ్చికం : అనేక రీతుల ధనం వ్యయం చేయవలసి వస్తుంది. ఒక విధంగా వ్యాపారానికి, మరొక విధంగా వృత్తిలో ప్రగతికి, ఇంకొక విధంగా అప్పులకై వ్యయించడం, ఇత్యాది ఫలితాలుంటాయి, క్రీడావనిలో సదవకాశాలుంటాయి. స్త్రీలకు : యత్న కార్యసిద్ధి, నలుగురిలో ప్రతిష్ఠ లభించే మార్గమున్నది.

ధనుస్సు : అవకాశాలకు ఏ మాత్రం లోపం లేదు. కాని ధనాగమనమే కష్టం. వ్యాపారం, ఏ విధంగా ఇబ్బందికి గురి సేయదు. క్రయ విక్రయాలలో, ఇబ్బంది సంభవించదు. చాల మందికి ఉద్యోగంలో ప్రగతి కనిపిస్తుంది. స్త్రీలకు : సామూహిక వ్యవహారాలలో ఎలాంటి లోపం కనిపించదు. చాల మందికి, ఆదాయం ఒకపాలు, వ్యయం నాలుగు పాళ్ళుగా కనిపిస్తుంది. వాస్తవంగా కూడా అంతే.

మకరం: చాల విధాల లాభదాయకమైన వారం. అవకాశాలను అందుకొని, సక్రమంగా నెరవేర్చుటకు బాగా శ్రమించాలి ఉద్యోగ వృత్తులందు పై మెట్టుకు పోగల అవకాశాలు, అధికారుల మూలాన ఏర్పడనున్నవి. భూమి వలన, గృహాల మూలాన ఆదాయం చెప్పదగిన వారం. స్త్రీలకు: వెనుకు ముందులాలోచించి, ప్రయత్నాలకు దిగడం, క్రీడావనిలో లభించిన అవకాశాలను సద్వినియోగం చేసికోవడం, ఎంతైనా గ్రహింపదగిన అంశం.

కుంభం: ఆదాయాన్ని మించిన వ్యయం చేయనున్నారు. అధికలాభాన్ని ఆపేక్షించడమేగాని అంది రాదు. ఒకానొక విషయంలో, మధ్యవర్తి పరిష్కారానుకూలత సంభవం. స్త్రీలకు: ఎంతో ఓర్పుతో, శాంత చిత్తంతో, నలుగురును కూడగట్టుకొని మెలగవలసిన కాలం. ఆశించిన విషయంలో అదీ ఉద్యోగ విషయమైతే, ఆశాభంగం తప్పదు.

మీనం : బంధువర్గ విరోధం ఏర్పడ అవకాశమున్నది. గ్రహచారం అందుకు దోహదం చేయనున్నది. సదానం ప్రధానం. ప్రతి వ్యవహారంలోనూ ఆలోచించిగాని దిగరాదు. స్త్రీ ప్రియులు చేరుతారు వారిని దూరంగా ఉంచడం శ్రేష్ఠం. స్త్రీలకు : శుభ కార్యానుకూలత వృత్తిలో కించిత్తు లాభం, లాభించే వారం.

విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.





## మేమందరం గోల్డ్‌స్పాటర్స్

# వారెవ్వా! వహ్వా!
# ఇదేమరి గోల్డ్‌స్పాటింగ్ రోజు!

ఇదొక క్రొత్త మాట కాదు సుమండీ!
ఉత్సాహంతో పొంగులు వారే ఆనందాలచిందులకీ,
మజాగా హుషారైన భావాలకు
ఇదొక అనుభవం మరి. ఆనందం, మజా,
తమాషాలు మూడూ కల్సిన ముచ్చటైన
మురిపపు మాటే...గోల్డ్‌స్పాటింగ్.




గోల్డ్‌స్పాటింగ్‌తో వహ్వా...మజా యే మజా!

TRIKAYA-GS-4-80-TEL